శ్రీరస్తు.

# నందుని చరిత్రము

## భక్తిరస నాటకము.



వేదము వేంకటాచలయ్యగారిచేత

ప్రణీతము.



చెన్నపురి.

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1928



[వెల 12 అణాలు

శ్రీరస్తు, శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శా. శ్రీరంజిల్లి నిజార్ధభాగమున గౌరీదేవియున్ ఫాలదృ
జ్జ్యోరావిర్భవమున్ స్వకాంతియుఁ ద్రివేణీసంగవిభ్రాంతినెం
తేరాణింప ముముక్షు లుత్కటమదాస్తంగోల్వఁ జెల్వొందిన స
స్థైరాస్యుండగుఁ దిల్లయంబలుఁడు మిమ్ము న్స్జేయుదీర్ఘాయురన్.

మ. అతినిష్యందు గణాత్ముఁడున్ జటియు వేదాంతైకసంచారి స
త్యతముం డాదికుటుంబియున్ బురజయుం డార్యాతపశ్శ్రీయుఁడం
చితమాయాకృత లోకుఁడున్ మునిమనశ్చిద్రూపి యై యొప్పి య
ద్భుత నాట్యంబును సల్పుశంభుఁడొసఁగున్ భద్రంబు లశ్రాంతమున్.

మ. "ఒకసూర్యుండు సమస్తజీవులకుఁ దా నొక్కొక్కఁడై తోఁచుపో
లిక నేదేవుఁడు సర్వకాలము మహాలీలన్నిజోత్పన్నజ
న్యకదంబంబుల హృత్సరోరుహము లన్నానావిధానూన రూ
పకుఁడై యొప్పుచునుండు" నట్టిహరు నేఁ బ్రార్థింతు శుద్ధుండనై.

---

# నాటకపాత్రములు.

---

| | |
|---|---|
| నందుఁడు | శివభక్తుఁడు |
| బ్రాహ్మణ మిరాశిదారుఁడు | |
| కృష్ణమ్మ | మిరాశిదారుని భార్య |
| శంకరుఁడు | మిరాశిదారుని సేవకుఁడు |
| సుబ్బలక్ష్మమ్మ | పురోహితభార్య |
| తిరువేంగడత్తాన్ | ఒక సాతాని |

సెట్టి, దీక్షితులు, ముత్తైదువలు, తాతయ్య, మాలలు మొదలగువారు.

స్థలము.—ప్రాయికముగ ఆదనూరును చిదంబరమును.




వేదము లక్ష్మీనారాయణశాస్త్రి,

2 భద్రయ్యతోటసందు,

పార్కుటౌన్, మద్రాసు.



శ్రీరస్తు.

అవిఘ్నమస్తు.

# నందుని చరిత్రము.



శ్లో. "కల్యాణం వో విధత్తాం కరటమదధునీలోలకల్లోలమాలా
ఖేలల్లోలంబకోలాహలముఖరితదిక్చక్రవాళాంతరాళం
ప్రత్నం వేదండరత్నం సతతపరిచలత్కర్ణతాళప్రరోహాత్
వాతాంకూరాజిషీర్షాధరవివృతఫణాశృంగభూషా భుజఙ్గమ్."



## ప్రథమాంకము—ప్రథమరంగము.

[ఆదనూరియగ్రహారమునకు వెలుపలి ప్రదేశము. నందుఁడు పాడుచు ప్రవేశించును.]

హుసేనిరాగము. రూపకతాళము.

నందుఁడు:—

భక్తిఁజేయుచున్న మఱి, ముక్తి నొందనగుఁగా॥ భక్తి॥
వ్యక్తుఁడై తా నిందునందు, నెందు నిండియుండు నని, యా
సక్తితో నాపరమేశుని, ననుదినమును మనమునఁ గొని॥ భక్తి॥
మచ్చరమదమోహములా, ముచ్చులఁ దునుమాడి
చచ్చుటగుఁ బుట్టువుపై, నిచ్చను విడనాడి

ఒచ్చెము లేనట్టి మానసంబుతోడఁ గూడి
మచ్చికతో వేంకటాద్యమతునిఁ గొనియాడి
హే చ్ఛిగుణానంద మన, సచ్చిదానందమె యని
హరునే, పురహరునే-గంగాధరునే పరాత్పరునే పాడి (వేడి)|భక్తి|

ఇన్ని దినంబులుగ, నీచపుఁ బుట్టుకవాఁడ నగు నా కెట్లు ఆపరమేశ్వరుని భక్తియు దర్శనమును లభించునా యని చింతించుచుంటిని. నేఁటికాచింత తీరినది. ఈశ్వరునకు ఒకఁ డెక్కువయు నొకఁడు తక్కువయును లేదు. పూర్వజన్మమందలి పుణ్యపాపవిశేషములంబట్టి వివిధములైన పుట్టుకలు కలుగుచున్నవిగాని వేఱు గాదు. ఈజాతిభేదము లెల్లను పుట్టిన యనంతరము కలుగువ్యవస్థలు. ఆపరమేశ్వరు నెవఁడు గాని కొలువవచ్చును. అట్లు కొలుచుట కెన్నిమార్గము లుండినను భక్తిమార్గమే సులభము, ముఖ్యము. భక్తిచే నన్నిటిని సాధింపవచ్చును. భక్తియే మోక్షమునకు మూలము. అదియే జీవునకు ముక్తి. కనుక నా సిద్ధాంతము ఆపరమశివుని, ఆ నటనసభేశుని, ఆచిదంబరమూర్తిని భక్తితోఁ బూజించుచుండుటయే.

బహుదినములుగ నాకు శివపరమేశ్వరునిఁ జూడవలయునను కుతూహలము గలదు. నేఁడు ఆ యుత్సాహము మఱింత యెక్కువగ నున్నది. సమీపమున నుండుటచేత రేపే తిరుప్పంగూరీశుని దర్శించి వచ్చెదను. చిదంబరము పోయివచ్చుటకు దినములు పట్టును. నా ప్రభువులు నన్ను వదలరు. దాస్యవృత్తి

నుండుటచేత వారికి తెలుపకగాని వారి సెలవులేక గాని పోరాదు కావున ముందుగా జేపు నాపనులన్ని యు ముగించుకొని, అన్నట్లు తిరుప్పంగూరికే పోయె దను. ఆవల నతని వేడికొని చిదంబరము వెళ్లెదను. జేపే వెళ్లెదను.

అదిగో మా కులమువారు నన్నే కాంబోలు వెద కుచు వచ్చుచున్నారు. నేను శ్రీ శివపరమాత్ముని కీర్త నముచేయుట వీరికి ఇష్టములేదు. మాల లా దేవుని, ఆ దేవదేవుని తలవంగూడదంట, బాపలదైవమంట; తలంచి నం జంపునంట. వీరికేలకో యీపిచ్చి. క్షుద్రదేవతలను కొనియాడవలయునంట. అట్లు చేయుకున్న కిడు గల్గు నంట! వా రిపుడు రాంగనే నేంటికథను వారికిం దెలిపి, బోధించి, వారినింగూడ నాతోడ తిరుప్పంగూరికి కొనిపోవుటకు ప్రయత్నించెద.

[ శెందిరిగాడు, ఈరిగాడు, పోలన్న, నారప్ప, శిద్దులు ప్రవేశింతురు]

శెందిరిగాడు.—నందా! శిక్కితివా, సీగ్గాను మేము యీడా ణ్ణో యెదకుతుణ్ణామే!

ఈరిగాడు.—ఈబాపనోల్ల అగ్గురారంకాడ నీకేంయింరా పని? సూస్తే కోపంశేస్కుంటారే.

పోలన్న.— ఆణ్ణి యీడ్చుకోరండ్రా! అగ్గురారందాటి, అడగా ల్చిందేమో అడగదాం.

నారప్ప.— నందా! రా, రా, యీడుండొద్దు. బాపనయ్యో వోర్లు సూస్తే కోపంశేస్కుంటారు.

నందు.— మంచిది.

[అందఱు కొంతదూరము వెళ్లుదురు.]

శెంది.— ఒరే నందా! నీకేం మతిపోయిందంట్రా, యీలా రోజూ రాత్రిల్లు యింటికాడుండక యెల్తుంటావే?

ఈరి.— యెల్లడం మాటుణ్ణిగాని, అగ్గురారంలోకి యెత్తే యేమనుకొన్నావురా? బాపనోళ్లు యిడిశిపెడ్తారనా?

పోలు.— కాదుండోశ్! నందయ్యా! నువ్వు ఇటీయల కొన్నాళ్లనుంచి సక్కంగుండ్లేదే. నీకేం మతితప్పిందా? మడిసా యెల్తావు గాని ఏమైన పనిశేస్తావా? అట్టే కూకుంటావ్; ఏంటో తలుచుకుంటావ్; కూస్తావ్; ఏడస్తావ్; పడతావ్; పొల్లుతావే. అయింతా ఏంట్రా?

నార.— ఉండ్రోశ్! ఊర్కే రోజూ అడ్డటమూ, ఆడేందో శెప్పటముగానే ఉండాదిగాని, అణ్ణి సక్కపరిశేదారి సూడండి. ఆనికి యేమో యెర్రె, అది అప్పుడప్పుడు పుడతానే వుంటది.

శిద్ధు.— కాదురా, మనమెన్నిసార్లడిగినా ఆ డేంటో శివశివ పరమేశరా, నటరాజమూర్తి, శిదంబరం, అరగర అంటుండాడేగాని సక్కంగాబదులు శెప్పడే. ఆయివరం అడగండి. అదేం దయ్యమా బూతమా యాడ సోకిందో కనుక్కోంటేగా?

శెంది.— ఏంయిరా నందా! అదేంటి ఆ అరగరాను అరకలును? శివశివేంటి, శివాలాడడం యేంటి?

నందు.— అన్నలారా! మీకు ఒక విశేషము చెప్పెదను. ఈ లోకములో జనులు పుట్టుటయును, కొన్నాళ్లకు చచ్చుటయును చూచియున్నారు గదా ?

శేంది.— ఔను.

నందు.— కొందఱు భాగ్యవంతులుగను, కొందఱు చాల బీదలుగను, కొందఱు యజమానులుగను, కొందఱు నౌకరులుగను ఉండుటనుగూడఁ జూచియున్నారుగదా ?

అందఱు.— ఔఔ సూశుండాము.

నందు.— ఎక్కువజాతి యనియు, తక్కువజాతి యనియు, బాప లనియు, మాల లనియు, బాపలయగ్రహారములోనికిఁగాని, వారి దగ్గఱకుఁగాని మనము పోఁగూడ దనియు తెలియునుగదా ?

శేంది.— ఔను. తెల్సుగాని యిన్నిమాట లేంటికిరా ? మేము డగతాంవుంటే, నువ్వేంటేంటో కతలు శెప్తావే. అడ్గే దానికి సక్కంగా బదులు శెప్తావా లేదా ?

నందు.— అవసరపడవలదు. అదే చెప్పఁబోయెదను.

అందఱు.— అయితే శెప్పు శెప్పు.

నందు.— ఇట్టి భేదములు లేక అందఱును ఒక్కటేతీరున ఉండఁగలచోటు ఒకటి కలదు. అది చేరుటకు —

నాదనామక్రియ, మాయామాళవము - రూపక తాళము.

శివలోకనాథునిఁ గని - సేవింత మిఁక రారో రయ్యా

భవభయములఁ దీర్చి (మన) తన - సేవగలుగఁజేయు నెపుడు|| శి||

ఫలమునాదీ సుఖము - గతము నెంచి యెంచి చూడు

హితమా నెండమావుల - గతి యేమా ననుచు నెంచి॥ శి॥
ఆశాంబుధిఁ గూలి పర - మేశుఁ గొలుచు తలఁపు మాని
పాశధరునిదండము లవ - లేశ మంచు నెంచితి మిఁక॥ శి॥
మానవ జన్మ మొదవెన్ - అను - మాన మేల సతనిఁ గొలువ
మానుగ మన మచటి కేగి - మానసం బానంద మొంద॥ శి॥

అన్నలారా! ప్రతిరోజును మనము పొట్టపోసికొనుటకై చేయుపనులు ముగియఁగనే, కొంచెమునే పైనను ఆశివపరమాత్మను మనసులో తలఁచుచు పాడుచుండవలెను. అట్లు చేసిన—మనము ఏకాలమున చేసిన పాపమునకో యిప్పుడీమాలపుట్టుక పుట్టినాముగదా? ఇది లేక—మంచి పుట్టుక కలుగఁగలదు మనకు; లేక, యీశ్వరుని సన్నిధానముననే యుండనలె ననిన నుండఁగలము; కావున మనమందఱము నాయీశ్వరుని భజనచేయుచు, ఆయన దర్శనమునకు తిరుప్పంగూరికిని, పిమ్మట చిదంబరమునకును పోవుదము. కనుక నేఁటిమొదలు, మన మాదేవుని భజనకు ఆరంభింతము రండు.

పోలు.— ఉండోశ్! యీాడిట్టే మనవాడవాదిలో కొందరితో అడుగడుక్కు శెప్తుండాడు. అదేపాటి నిజమో తెలవకుండాది.

ఈరి.— తెలిశేదేం, గిలిశేదేం. ఆడుశెప్పేది బాపనోళ్లు శేశేపనే? మనం మాలోల్లమే. మనం శేస్తే పాపం గాదంట్రా?

నందు.— అట్లనరాదు. మీాకీవిషయము కొన్నాళ్లయిన వెనుక చక్కగా తెలియఁగలదు. ఎన్నియో హింసలుచేసి.

జీవించుచుండిన బోయవాఁడొకఁడు ఇట్టిదని యెఱుఁగక ఆశివపరమేశ్వరునిపూజించి, పుణ్యలోకమునకుఁ బోయెనఁట.

పోలు.— ఖొరాపో, ఇదేం పున్నెంరా! యాడన్నా తేరు, తిర్నాల్లుండి సూస్తే పున్నెంగాని; కాకుంటే ఏరు గట్టుకో నెల్లాం రండ్రా.

నందు.— అచటను తేరుకద్దు తిరునాళ్లుకద్దు రండి పోవుదము.

ఈరి.— మరేంట్రా! యీడేఁటో కలంలో లేనియంతా యెర్రోన్నాగు శెప్తుంటే నిల్బడుకొని యింటారా? తెలియిమాలినోళ్లు.

శెంది.— కాదుండోశ్, వాడింగా ఏంటేంటి శెప్తాడో యిందాం.

శిద్ద.— ఓరేయ్ యెట్టి యెయ్యదాలు, అందుట్లో యిదోటి. కాదంట్రా నందయ్యా?

కారి.— కాకేంట్రా; శిదంబరమంట, తేరంట, తిరునాల్లంట; మాలోల్లమే, మన మాడికెల్లొచ్చునటా? మరోపారనబోకు; సచ్చిపోదుం.

నందు.— మీాగ్రహచార మింకను ఎన్ని జన్మములో ఈనీచ జన్మము? ఏమో కొంచెము పుణ్యముచేసి మనుష్య జన్మ మెత్తినారము. ఇప్పుడైనను కొంచెము తెలిసి, దేవుని కొలిచినఁగదా కడకు మనకు పుట్టుకయిన మంచిదిగ నుండును?

ఈరి.— బలే పుట్టక సూశాడ్రా యీడు!

పోలు.— నూవు ముం దేపుట్టక పుట్టినావురా?

ఎల్లి.— ఆఁ ఏదో గాడిదపుట్టక పోరా పో ; కాకుంటే మా టినడంటావ్ ? కాదంటావ్ నందా?

శెంది.— మరి ఆడేంటో శెప్తాడే అదియింటే నాకు కొంచెం సందేగంగానే ఉండది. ఓటి రో న్నాల్లు ఆడు శెప్పేలాగు శేస్తామంట్రా? ఏంటి మనం శెడ్డాది.

ఈరి.— ఈడుకూడా శేరాడ్రోయ్!

శెంది.— నూవేమంటావ్ మామా?

పోలు.— కానీ, అలాగే శేస్తాం.

ఈరి.— సరే, మరి వాసరాయనతో శెప్పి యెలేయిస్తాం గానిండి.

శెంది.— ఎలేంట్రా ? ఎలీని గిలీని. రండర్రా మనమొందరో శేరుదాం. కులమును గిలమునుకూడ. ఎన్నాల్లయిన యీ యీనకులమే.

పోలు.— ఓ రోర్రా శేరేవోల్లు, ఓ తట్టుణ్ణాండి.

ఎల్లి.— మరి, బోడిగాడు, పోలుగాడు, పొట్టోడు, కోశి గాడు, కోడిగాడు, శింగడు, శిక్కడు, శినోడు, నూవు, మామాను, నేనును.

శెంది.— అంతా ఎందర్రా ?

ఎల్లి.— పదిమందిన్ని ఇంగోడున్ను.

పోలు.— మనమంతా ఒక్కట్టు. నందయ్యా, రావోయ్ఎల్లాం. మనమంద రొక్కట్టు. నూవు మాకు పెద్ద. మప్మేడికి రమ్మంటావో వొస్తాం. ఏమి శెయ్యమంటావో శేస్తాం.

చారి.— సరి యింగ మనోల్లంతా రండోయ్? దాసరయ్యతో శెప్పి కట్టు శేయిస్తేనేగాని యిదో వాయినం గాదు; రండెల్దాం.

ఈరి.— సరెల్దాం, రండి.

(అందఱు వెళ్లిపోవుదురు.)

నందు.— మీరందఱు నేను చెప్పునట్లు చేయుఁడు.

శెంది.— సరి.

నందు.— విభూతి పూసికొనుఁడు.

[అందఱు నట్లేచేయుదురు.]

నందు.— శివశివ అనుఁడు.

అందఱు— శివశివశివశివశివశివ.

పోలు.— మన మెట్టుండాంరా? బాపనయ్యోర్లాగుండ్లా? సూడండ్రా ?

శెంది.— ఔరా దంజెం లేదుగాని, బాపనోల్లమే.

పోలు.— ఒక్కదంజె మేంట్రా! ఎర్రంగా గూడుండొద్దంట్రా? ఆనక మాట్టాడ్దాంగాని, నందయ్య శెప్పేలా గినండి.

అందఱు.— అట్టే.

(అందఱు నందుని వెంబడింతురు.)

నందు.— మనమందఱము ఉదయములోగా తిరుప్పంగూరికి పోవలెను. తెలిసినదా? ఉత్తచేతులతో పోరాదే.

పోల.— మ రేలాగా ?

శెంది.— తోలు, వారు ఉండది; గోరోచనం ఉండది. కానిండోయ్.

ఎల్లి.— మాలాడలో అంతకన్న యింగే ముండాదోయ్. తోలూ వారూ నగారా డమాయిలకుపనికొస్తాయ్ పదండి.

శెంది.— మామ మాత్రం మన్లో శేర్తె బాగుండేదిరా; గాగా మాట్లాడేవోడు.

పోల.— ఈడికేమో కొంచం బయ మేస్తుండదిరా.

శెంది.— బయ్యాం గాదురా. నోరు గల్లోడు గాదంట్రా?

పోల.— మనకు లేదంట్రా నోరు.

ఎల్లి.— మరి ఇళ్లకాడి కెల్లి అందరున్నూ పదెన్నా రొప్పొంత ఎత్కొల్దాం, కూడో సంగటో వాళ్లోకి.

పోల.— అయితే యిపుడే యేంట్రా.

ఎల్లి.— మరి అదితే గంజి పాత కాలది. బిర్రీన గానిండి. పైవాళ్లొచ్చేలోగా.

అందఱు.— సరి అంద రెల్దాం కానిండి.

[నందునితో అందఱును పాడుచు వెళ్లుదురు.]



## ప్రథమాంకము - ద్వితీయరంగము.

స్థలము : మాలవాడలో నొకచెట్టుక్రింద.

(అంతట బోడన్న, చెంగడు, శెవులోడు, నాగన్న మాటలాడుచు ప్రవేశింతురు.)

బోడన్న.— అదేం మామ ఓటీరు గుండావ్ ఉసార్లేక.

చెంగడు.— ఉసా రేంటిరా! ఉసారున్నూ, గిసారునూ. మాపిల్లోడు

నందుకుండాడే ఆడి సమాశారం యేం బాగుంట్లే. రేపూ మాపూ నాకదే దిగులు యికారంగుండది. ఎంత శెప్పినా యినడు. నాకే దొచ్చినా గండాలే.

బోడి.— నీకేం పోసీరాదు అణ్ణే ఆడిదోవనే. యెన్నాళ్లైనా యింటేసరే; పట్టుపట్టి, పెదదార్లో పొయ్యేవోల్లకు యెవరేం శెప్పేది? ఆడు యేరే వుండాడుగా?

చెంగ.— అట్టుం జేంకు కొతడా బోడన్న. అబ్బ సచ్చినా కాణ్ణుంచి నాయప్పశెల్లె పిల్లోణ్ణ నాయింటిలోనే సాకీంది. అణ్ణెమాబిడ్డగా సూస్తుణ్ణాం. మల్లా నేను పెల్లి శేస్కాకుండా వుంటే ఆల్లాంతా నాయిం ట్లోనే ఉండేవోల్లు. ఆ నాడే యీయాటలంతా నేను సాగనీను. ఆడు గానపోయినా నాయప్పశె ల్లుండదే దాన్ని సూస్తే నాకు జాలేస్తుది. పొయ్యే వోడు వచ్చేవోడు అందరు ఓమాటంటుంటే!

బోడి.— ఆఁ అద్దది. నూమాత్తరం మల్లా పెల్లిశేస్కాకుండా వుంటేబాగుండేదే. ఉఁ ఇంగేఁ అయినాదాన్కి. ఆఁ మరి సాలని కొడవకు నందుడూ ఇంగోరోరో అందురూశేరి తిరుప్పంగూరెక్కల్లారంట్నే, అదేం టా సమాశారం?

చెంగ.— అదే నాకు మరింతా దిగులు. సచ్చేకాలాన్కి ముకి లిదాన్కి మరీ యేడ్పు. ఈడ గాకుంటే అందరు తెల్కినోల్లు; మొత్తెట్కాంట పోసీ యనేవోల్లు.

ఇంగా ఆడ ఓర్రైన, మాలోడి కీడేంట్రా పని అని
నాల్లు సల్లిస్తే యింగేంగతి?

బోడ.— మరి ఆడు యెల్లడం కాక శెందిరిగాడు, చండోడు, ఇంగా ఓరోరోపద్కొండుమందిని తీస్కెల్లాడంట్నె నేను ఊళ్లోలేను. సంతకెల్లుంటే నాకేం తెలవలేదు ఆళ్లందరూ యీడి మాటెట్టా యిన్నారోయ్ తెలి యిలేనివోల్లు?

చెంగ.— ఎట్టిన్నారో! ఇదేం ఓనాటిమాటా ఓనాటిశాతా? శాన్నాల్లుగ జరుగుతుండదేగాని. రోజూ రాత్తిరి జాముపొద్ద కల్లా యెల్తుంటే యాణ్ణో కన్నేశం డాడుగామాల్నని అనుకోంటున్నాం. ఆడ బాపన యీదులో అదేంటో కతలు యింటావొచ్చి ఆళ్లో ఆడే ఏంటేంటో పిచ్చోన్లాగ అరుపులు, ఆటలు, ఏడ్పులు, తందనపదాలు. అట్టిట్టంతా శేటింది. పిల్లా గాదు కన్నాగాదు. ఎప్పుడూ కులంలోలేని యీ వెఱ్ఱి కుదిరింది; పారిపోయినాడు.

బోడి.— తా శెడ్డా కోతి వానమెల్లా శెరిశిందంట. ఆడు పోవటంగాక, యీళ్లనీ పిలుసుకోపోవటమేంటో? ఆల్లింటోళ్లు సీమీదా ఆముశిలిదానిమీదా పడి మొత్కోవట మేంటో? అంతా యిపరీతంగుండాది.

(శిద్దుగాడు ప్రవేశించును.)

శిద్ద.— ఏంటోయ్ యింటికాడికెల్లి మీరు లేదంటే యీడ్కొచ్చినా, మరి సమాశార మేంటో తెల్సిందా.

చెంగ.— యీడిదో కడుపుమంట సాల్నందుకు. ఏంట్రా?

శిద్దు.— మరి నేను పోయిన సుక్కురారంనాడు, మా అయ్యా వోరు ఉండాడే ఆయన అత్తగారింటికి వాల్లు తో ల్కా పొమ్మంటే పోయినాను. పోయినానా, మరి ఆరేత్తిరే నేను బయలు దేరివొస్తే తెలవదుగాని అయ్యావోర్లు కారిత్నాలిస్తాం తీస్కెల్లమంటే ఉణ్ణా ను. ఉణ్ణానా, ఆరాత్రి జాముపొద్దుకు వూరంతా ఓపెద్దగోల పుట్టింది. యేంటిరా అని సూస్తుగదా! ఆదనూరంట, ఓ మాలకుర్రోడు కొంతామంది మాలోల్లతో కూడ ఆడికొచ్చి, గుడికాడి కెల్లి తేరుకాణ్ణే ఏంటేంటో ఎగరతా పాడతాఉండాడనీ, ఓరుశెప్పినా ఎల్లడనీ, గుడంతా సుట్టొచ్చాడంటనీ బాపనోల్లంతా ఏకంగా వచ్చేతల్కి ఇంతలో యెల్లిపోయినాడంటనీ శెప్పినారు.

చెంగ.— మరి నూ సూశావా ఆణ్ణి.

శిద్దు.— యెల్లి సూస్తామంటుణ్ణా గాని, ఆతల్కి అయ్యావో ర్లు బండి కట్టమని తొందరెట్టినారు.

(శెవ్వులోడు ప్రవేశించుచు)

శెవు.— ఏంటోయ్, శెంగన్నా! యున్నావా మరి, సందాయ సమాశారం?

బోడి.— ఏం యిరో నూ వెప్పు డొచ్చావురోవ్.

శెవు.— ఇద్దొ వొస్తావుండా.

శిద్దు.— మీావోల్లంత వొచ్చేశినా రంటోయ్?

శెవు.— అందరం ఒచ్చేశినాం.

శిద్దు.— మరి సందాయ సమాశారమేంటి?

శెవు.— మావోల్లంతా మరిదాన్లో తిరుప్పుంగూళ్లో మాపిల్లా
దాని మేనత్తుండాదనీ సూశెల్లాల్నని శెప్పితే,
రాత్రి ఆమన్నాము. తెల్లారిజామున కాలసాయ
యెల్తుంటే, ఆశేటో కొత్తగా ఓ గుంటుణ్ణోంది.
మరి నేవ్వూరి కెల్నారో జవుపక్లేదే అప్పుడే రొణ్ణా
ల్లకల్లా యట్టొచ్చిం దని అడిగేతలికి, మరి ఆద
నూపన్నండి ఓ మాలో డొచ్చినాడు, ఆమ తొవ్విం
చా డన్నారు.

చెంగ.— మాలో డేంటి, గుంటతొవ్వడమేంట్రా ?

శెవు.— మరి ఆళ్లన్నామాట. ఓ నాటి రాత్తిరి పదకుండు
మంది వొచ్చారంట. వొచ్చి, వూరంతా ఆడతా
పాడతా తేరుకాణ్ణించి ఆరశాటాలుశేస్తా గుడంతా
తిరుగుతున్నారంట.

చెంగ.— ఓరూ ఆణ్ణి యేమ న్లే దంట్రా?

శెవు.— అసటనూ, ఆ వూరోల్లంతా ఏకంగా ఆడెవడో
మంతరగాడో, దేవుడో, అంటుండారు. మరింగా
యినేసం ఏంటంటే, అది బాపనోల్లగుడా? అందు
ల్లో ఏంటో లోపల ఓదేవుడుండా డంట. ఆదేవుడి
మొగిదాల ఓయె ద్దుండాదంట.

శెంగ.— దేవుడేం కాడెట్కా నొస్తాడా దున్నడానికా,
ఎద్దేంటికా?

శెవు.— కాదురా. ఆదేవుడి వాగనం అంటా అది. నల్ల
రాయితో శేశి ఆ దుండాదంటా. తెల్లారె గుడికె
ల్లి సూస్తే ఆయెద్దుండదే అది ఓపక్కా కొరి

గుండాదంట. ఊరంతాగోలే. అందరు ముక్కు మీద శేస్కోట్కానేవోళ్లె.

చెంగ.— ఆ మూలో డోరంట?

శెవు.— ఓరా? మన నందయ్యేనంట. ఆవూరోల్లంతా, శెప్ప రానివోడు గుంట యెత్తితే నీల్లుముట్టరాదు అని కొంతరూను, కాలం శెడుతుండా దని కొంతరూను, గుడి కేంటో శెయ్యాల్నని కొంతరూను, ఇట్టంతా అనుకుంటుండారు. సూస్తాం అంటా అంతా యెల్లి సూశినా.

శిద్ద.— నాయాల, అంతా సూట్టం ఏంటిరా? నిన్నుగుడి సూణ్ణిచ్చారంట్రా?

శెవు.— తేరుకాడి కెల్లి అడ్డెతల్కి అందరు అద్దొ సూడు ఎద్దు ఒరిగుండాది ఒరిగుండా దంటన్నారు.

శిద్ద.— వాళ్లంటే నువ్వు ఆళ్ల శెయిసూపుసూశావా?

శెవు.— మరి పోనీగాని, బావా! నంద య్యొచ్చాడా?

చెంగ.— తెల్లేదు. నేనొచ్చే తల్కి యింటికాల్లేదు. ముశిల్ది మాత్తరం యేడుస్తుండింది.

(శిక్కన్న ప్రవేశించును.)

శిక్క.— మామా? మామా? నందయ్యొచ్చేశినాడు. మరి అందుకు వొచ్చేశినారు. మొకంలో ఒల్లంతా తెల్లంగా పూస్కాని, మెల్లో ఏంటో శాపసయ్యవో ల్లేస్కొంటారే అట్టాటి దండ లేస్కొని ఆడతా పాడతా ఎగరతా వొచ్చి యింటికాడి కెల్లాడు.

చెంగ.— మర్రైతే మీరందరండిరా. ఆణ్ణి సూశి నాల్గూ పెడదాం.

శిద్దు.— ఆణ్ణి యీడికే పిలిపిస్తే రచ్చ కాడికి.

శిక్క.— కాదుకాదు. ఆడుండేతీరు యీడికొస్తాడో రాడో. మనమే యెల్దాం రండి.

శిద్దు.— ఇంగో టుండదోయ్ ; ఇంతటితో పోలేదు. మల్లా అదేంటో శిదంబర మెల్లాలె నంటుండాడు.

శిక్క.— అయంతా కాదుగాని, మిట్టమీద తాత య్యుండాడే ఆయన మనకులం పెద్ద. అన్నీ తెలిశినోడు. గడ్డాం తల అంతా నరిశిన ముశిలాయన. ఆయన్ని యెంటపెట్కొని యెల్లి నందుణ్ణి కదిలించి బుద్ది శెప్పిస్తాం.

శిద్దు.— ఆఁ ఆద్దది అద్దది, బాగుండాది అట్టే శేస్తాం. అందరును రండర్రా యెల్దాం.

[అందఱును నిష్క్రమింతురు.]



శ్రీ

# ప్రథమాంకము—తృతీయరంగము.

---

స్థలము : మాలవాడ.

[నందుఁడును, అతని యనుచరులును ప్రవేశింతురు.]

శంకరాభరణరాగము - మిశ్ర చాపుతాళము.

నందుఁడు:—

రేపే నే నేగక యుందునా - నేఁ

బాపకూటపుబొందినందునా- రేపే నే॥

రేపు మాపును రిత్తగందునా రేపే నే॥

దాపా యమున కోడియుందునా రేపే నే॥

అపరమేశుఁ జూడక యుందునా॥

శెంది.— నందయ్యా ! మనమంతా ఊరికొచ్చి యింగా ఒక గడియకూడా కాలేదే. అప్పుడే మల్లా యేంటోయ్ రేపటికేగతా రేపటికేగతా అంటుండావు. ఈడ మనోళ్లు అల్లరంతా కొంచం అణిగితే ఆసక సూసుకుందాముండోయ్, అవసరపడాకు.

నంద.— ఆహా, అన్నలారా! మనము కడతేరవలయు ననిన ఆదేవదేవుని చూడకుండరాదు. కాన మీరును ఆలస్యముచేయక రేపటికే వీలు కలిగించుకొని పోవుటకు సిద్ధపడుఁడు.

పోల.— నందా? మామాటినను. ఊర్కే పిల్లాట్లాడాకు. అంతా నూపోయిందే పోకలా? రోణ్ణా ళ్లుండోయ్ అల్లరంతా అణిగేదాకా అంటే ఊర్కే మెగురుతుండావ్? తాలోశ్ తాలు, శెప్పినట్టు తిరుప్పాంగూరి కెల్లొచ్చుండ్లా? పోదాం పద. ఈడ యింటి కాడ అందర్నట్టే యిడిశేశి పోవటమే గింజలు పుల్లలు నూస్కోక?

నంద.— మీ కిన్ని దినములుగ చెప్పియు తెలియకున్నందులకు నేను చాల చింతించెదను. ఏదైన నొక కార్యము పూనుకొన్న, వెంటనే, అది ముగియుటకు ఆలోచించుచుండవలయునే గాని, నేఁడు గాదు రేపు అన్న నేఁడు రేపౌనా? మన ఆయుష్కాలము నీటిమీఁది బుగ్గవంటిది; క్షణప్రాయము. అనుకూలించిన సమయమందు ఆదుకొనవలయునే గాని ఆలస్యము చేయరాదు. ఇపుడో యిక క్షణముననో మన యంత్యము. కనుక నామాటవిని నాతోడ భజనచేయుఁడు. రేపు బయలుదేర సిద్ధము కండు.

రాగము: కేదారగౌళ - తాళము, ఆది.

ఆనంద మున్నదఁట
మనమందఱు వెడలుద — మానంద॥
అందఱును కొనియాడెడిచిదంబర
నాథుపాదసేవఁ జేసిన — ఆనంద॥

పోలు.— అయితే నువ్వేంటోయ్ శెప్పేది?

నందు.— తిల్లయంబలమును చూడ రమ్మనెదను.

అందఱు.— కల్లమాట మేము వినమంటాము.

నంద.— శంకరా శంకరా యనుమనెదను.

అందఱు.— ఇంకా రా మింకా రా మని యంటాము.

నందు.— మాలజన్మ మింక లేకపోవుఁగదా?

అందఱు.— మాలో నీవు చెడఁబుట్టితివిగదా?

నందు.— శంకరదేవుని దర్శింతము రండు.

అందఱు.— అంకాళమ్మను గొల్తువుగా నుండు.

నందు.— అయ్యో! యీవంకరమాట లేల? మీకు మంచి దారియే గదా చెప్పుచున్నాను.

శెంది.— మంచిదారియో కంచెదారియో, ఇదెరకొచ్చిండాం మేము, సాలు, మాయాలుబిడ్డల్ను యీడ పార నూకి మేము రాము. మేము లేకుంటే మావుసురు కేడుస్తుంటారు.

నందు.— ఎక్కడి ఆలు, ఎక్కడి బిడ్డ? మీదారికి వారేమైన నడ్డమైరా? ఔదురా? ఇప్పుడు మీసంపాద్యము పాలు పంచుకొనువారు తేవు యమునియొద్ద భాగ మునకు వచ్చెదరా? సంతలో మనమందఱము చేరినట్లు ఇప్పుడు చేరియున్నాము. సంతకలిసిన నెవరిదారిని వారు పోయినట్లు కాలముతీరిన నెవరి దారి వారిదేగదా; సహాయ మేమైనఁ గలదా?

శెంది.— మనం సస్తే యీడుమాత్రం గూటాంలా గుంటా డోయ్ సావక. యీడికి పెల్లాం గిల్లాం ఓరూ లేకుం టే యీడిట్టసడం యెర్రియేదాంతం ముదిరింది.

పోల.— ఈ దంతా సూశ్చాడోయ్; యమదూను గిము దూను.

శిద్ధ.— ఉండోశ్ ఉండోశ్, అల్లద్గో మనోల్లు వొస్తుండారు. ఆఁ తాతయ్యకూడా వొస్తుండాడు. ఆఁ ఆఁ ఈడికే. మన మెల్లి ఓసొట్టుంటాం.

[తాతయ్య ప్రవేశించును.]

రాగము: జేహాగ్ - తాళము: ఆది.

తాతయ్య.—

న్యాయ మౌన - యిది తగునా -
ఓరి నంద వినర - మన జాతికి నగునా  న్యాయ||
చిదంబర మనియెడి మాట - అది తగ దనఁగను మనవోట,
మద మనఁ దగుఁగద నీయాట - ఇది తగదు వదలు నీకు చేటూ|| న్యా||
మాలల కేటి "తైప్రాశఁ" - అది చూడఁ బుట్టెనో విశ్వాసము;
వాడబాలుర కీయుపదేశము - బహుబాగాయె న్బలు మోసము|| న్యా||
వాడలో లేని యీ మేర - మతి వలదుర దానిని గోర,
మన పెద్ద లొప్పఁ గలతీరా - బలుబా గింతటనో రాగా|| న్యా||

తాత.— మరేంట్రా, యేంట్రా. ఒరేయ్ నందయ్యా! ఒరేయ్ అబ్బిగా నీవు శెప్పుతుండావే అది బాపనోల్లదైవం, మనం కొలిస్తే సచ్చినాంరా నాయనా సచ్చినాం! నువ్వు మంచివోడివి. అన్నాయంగా నిన్నెవరో శెడిపేశినారు. నీయబ్బ నాకు శానా కావల్సినోడు. మీయబ్బ నేను ఒక్కయ్యోరికాణ్ణె కొలువు కొల్సి శేద్దాం శేశినోళ్లం. నూవు చెడిపోబాకు. మనం

బతికినన్నాళ్లు ఆ శాపనయ్యోర్లనే కొలవ్వాల; మన దేవుళ్లనే కొలవ్వాల.

నంద. — తాతా, నీవును ఏమియు తెలియనివారివలె మాట్లాడెదవే, బాగున్నదా? బ్రాహ్మణుల కొక దైవమును, మాలల కొక దైవమునా? నిత్యానందము నీయఁగల దేవుని కొలిచిన చావనెదవే; ఈమీరు చెప్పెడు దేవతలను కొలిచిన మాత్రాన చావు లేదా? బ్రాహ్మణులను కొలువవలసినది నిజమే. అయినను, ఆ బ్రాహ్మణులకును, నీకును, నాకును, అందఱకును పెద్దయైన ఆ దేవునికొలువు గొప్ప కాదా?

తాత. — అద్దో! మాటకు మాటంటే సరిగాదు. కులమోళ్లు నల్గురూ మెచ్చాలె. అంతేగాక, మన దాసరయ్యోలు మనం ఏదైవం కొలవ్వాలనంటారో ఆదైవమే మనం కొలవ్వాల. నూ జెప్పినా పెద్దదేవుణ్ణి కొలిస్తే, యీ దేవుళ్లకంతా కోపం రాదా, ఆపాట్న, మనవాడ మీదికి అమ్మోర్లు, ఆవేశం, దూము అంతా రావా? పాపం, యేల జెడిపోతావ్.

నంద. — ఈమీమాటలు యుక్తమైనవి కావు. కులములు అన్నియు మనమై తెచ్చి పెట్టుకొన్నవి గదా? మీరు చెప్పిన ఆ దైవములను మీరందఱును ఇన్ని దినములుగా కొలుచుచున్నారే, మన వాడలోకి, మీరు తెలిపిన ఆవ్యాధు లేవియును రాకున్నవా? కాకున్న ఆ దైవములపేర్లు చెప్పి అన్యాయముగా కోళ్లు, వేఁ

టలు పోతులు వీనిని బలియిచ్చి పాపమునకు పాల్ప
గుటయేగాక?

తాత.— నేను శానా పెద్దోణ్ణి; నామాట యిను. పెద్దోల్లు ఓగిరి గీశి నూపీడుండాలంటే, ఆడే వుండాల. అది మంచిది. అంతేగాక ఎన్నాల్లుగానో వొస్తుండే కులము ఆశార ముండయే ఆటినంతా మనం యిడిశేస్తే పాపం కాదంట్రా?

నందు.— నిజమే. పెద్దలిన్నిదినములు చీకటిలో నుండిన మనము చీకటిలోనే యుండవలయునా? వెలుతురు చూచుకొన నావశ్యకము గాదా? ఊరక యేల యిట్లు వృథాకాలక్షేపము చేసెదరు? ఎంతో పాపము చేసి యీమాలజన్మము నెత్తినారము. ఇకనైన మంచిజన్మ మెత్తుటకు లేక ఆపరమానందదాయకుని సన్నిధానమునం దుండుటకు తగిన యుపాయమునాలోచింపక ఉండనగునా? తగునా?

తాత.— అయ్యోర్లగ్గాదంట్రా ఆదైవం? మనమంతా ఆదైవాన్ని కొలిశేట్టుంటే మనల్ని ఊల్లో శేల్నీరా, ఆరిదేవృణ్ణి సూణ్ణీరా? ఊర్కె యెర్రిపోకలు పోయి శెడిపోబాకు. మనం కొలవ్వాల్సిం దేదంటే—

ఉ. శేలను నమ్మి దైవ మని శేకులం మోడిశి సుట్టిపచ్చుచున్
సాలగ నీరుగట్టి మతి సక్కగ దున్నుచు సత్తువెట్టుచున్
సాలుల దీర్చి నాటి యది సాగగ కల్పుల దీసి పండగా
గాలము గాశి పొంగలిడి కత్తెరదేవుని పూజశేయుటే.

నందు.— అవును నిజమే. మనము కొలిచిన ఆదేవుఁడు మనలను చంపునా? ఆబ్రాహ్మణులపురాణములోనే యిటీవల వింటినే, ఆదేవునికి జాతిమతభేదములు లే వని.

తాత.— అట్టుంటే ఆదేవుడు బాపనోల్లని మాలోల్లని యేల పుట్టించాల?

నందు.— పుణ్యముచేసినవారిని సదా తన్నే చూచుచు, కొలుచుచు నుండుటకుగాను అట్లు బ్రాహ్మణులుగాను, పాపము చేసినారము గనుక మనల నిట్లును పుట్టించినాఁడు. ఇప్పుడు మీ రా దేవుని కొలిచిన పైజన్మమునకు మీరును బ్రాహ్మణులుగా పుట్టుదురు.

తాత.— (యోచించి) నూవెంత శెప్పినా మనం శేయగూణ్ణి పని శేయగూడ్దు, శేస్తేసూడు, ముందు మనయింట్లో పెల్లాంబిడ్డల్కు శేటు. ఊరోల్లు, బంధువులు, కులమోల్లు అందరికి కోపాలు, దగ్గర్రారు. దాసన్ల యెలేస్తారు. బాపనయ్యవోర్లు, మాల యెదవకు యింతపొగురా అని కొలువు తోశేస్తారు. ఆమొయిన కూటికిలేక, ఇల్లులేక, వాకిలిలేక అల్లాడాలె. మన దేవుల్లకు కోప మొస్తది. యియంతా యెంత తంటా లుండాయో సూడు. గనక వొద్దు నామాటినుఁ శెడాకు.

నందు.—

రాగము: నాదనామక్రియ - తాళము: అది.

మీసము నెరసినదే తాత - (నీ)ఆస నెరయ లేదే
పాశము వచ్చెడినే తాత - పుణ్యము లేశ మయిన లేదే

మానవజన్మంబే తాత - మానిన రాదుగదా,
గానుపంగినావే తాత - కోపము విడిచితివా,
మేను పడలినదిగా తాత - మానితివా యహము.
క్లేశము నెడబాసియు తాత - చిదంబరేశుని దలంపవయ్యా. మీాసము॥

తాతయ్యా! ఇంతవయసు నిండుకొని యిట్లు నీవును వానివలె తెలివిలేక మాట్లాడెదవే, ఏమిచేయునది? వయసువచ్చినదిగాని నీకు మతిపోయినదే, కాలము సమీాపించినదే, ఇంకను యిట్లుండ తగునా? నీకొక్కరహస్యము చెప్పెదను వినుము.

[అని విభూతి నెత్తి నిడి నోట వేసి శివనామ ముపదేశించును.]

తాత.— ఆహా! ఏమిది? వీఁడేమో చెవిలో చెప్పినంతనె నాదేహ మొకతీరై మాటలువేఱై ఏవేవో తోఁచుచున్నవి.—నిజముగ వీనియందేమో ప్రభావమున్నది.—నందా! నీవు నాకు గురుడవైతివి. నామనసు ఆనందించెను. పెద్దబరువు దించి నట్లాయెను. నీయుపదేశము ఫలించెను. నీకిదె నమస్కారము. నేను పోయివచ్చెద. నీ వన్నట్లు ఆశివపరమేశుని కొల్చుచుండెద.

నందు.— తాతా, అన్నియు నాపరమేశునాజ్ఞ. నీవింక నిట్లే చేయుచుండుము. పొమ్ము. ఎల్లరకును దీని నుపదేశించుచుండుము. నేనును ఇంటికి వెళ్లి మాతల్లినిఁ జూచి రేపటికి యజమానుని సెల వడిగి చిదంబరమున కేగెదను.

(నిష్క్రమించును.)



శ్రీ

# ప్రథమాంకము - చతుర్థరంగము.



స్థలము : మాలవాడ.

(మాలలు మరలఁ బ్రవేశింతురు.)

శెంజి.— ఏఁయిఁరోయ్ యీరిగా, తాత య్యెల్లాడే, చాంచే పయిఁదింగా రాగాసం ?

ఈరి.— అఁదుకే మనమూ యెల్దా మంటె వొద్దన్నావ్.

(తెరలో కలకలము.)

ఓరి యీరిగోవ్.

ఈరి.— ఆఁ ఉఁడోశ్ ఓరో కూస్తుండాను.

శెంది.— ఆఁ మనోలే. ఎల్లుగాని కూ యది. ఓహోయ్. యెల్లుగా, ఈడీస. గుడికాడ.

లు.— ఆ డున్నాం డున్నాండి.

శెంది.— ఏం దా తాతయ్య యే మఁటుండాడు ?

(తాతయ్య ప్రభృతులు ప్రవేశింతురు.)

తాతయ్య.—

రాగము- నాదనామక్రియ- తాళము, ఆది.

దుడుకు వలదురా - కీడు మూడును
చెడుదుము చేరిన - పిడుఁదు, వానికి
నెకమై యుండుఁడు - చేరఁడు మనలను
కోరఁడు సుఖముల - నొడయని కైనన్

అడుగఁ జాలఁడు - ఉడిగెను మూఁటిని
ఎడారిగాదు - పడారిగాదు
ఇడుమల దేనిని - గడనచేయఁడు
మడిచాయందా - నడుగిడఁజాలఁడు.
గుడాకేశునే - యెడఁ గొనినాఁడు.
అంతరంగమున - సంతసంబునన్
మంత్రంబు తా - నెంతయుఁ జేయుచు
అంతరాత్మ - జీవాత్మలెల్ల నాపరమేశుఁడె యని.
ఆనందము - సహజానందము
విద్యానందము - యోగానందము
బ్రహ్మానందము - పరమానంద మ్మని
నమ్మినవాఁడీ - వాడనె గాదీ
పుడమిలోనె - లేఁ డేసను వాని
ఈడేఁడును - మననందున కెప్పుడు||
సరిలేరా నందునకున్ మన - వాడలోగాని, యింకెడను గాని
వార చిదంబర మని యొకపరి యైనను
పరిపరివిధములఁ గోరుచు వేఁడెదు||

శెంది.— ఇఁదుకా నిన్నంపినావి. బేష్. బలే వోడివే. ఆజ్ఞే దానికి తేకుండా, ఆడిదారనే యిడ్సి సూగూడా ఆల్లో శేర్నావ్. బలే మొనగాడివే ?

ఈరి.— గూ నిరగ తి న్నిడిపించండ్రా యిన్ని.

తాత.— ఊరికే చెడిపోకండి. మీగ్రహచారం మీరు కుదురుపడుదారి చూడండి. వానిజోలికి బోకండి.

ఎల్లు.— జోలీని గీలీని. ఎల్లోయ్ యెల్లు. మఱి ముశిలోడు గాన యిడిశినాం గాని యింగోడైతేనా!

తాత.— మీా గ్రహచారము.

(నిష్క్రమించును.)

ఈరి.— ఏయిటిరా. ఇట్టుంటే బాగుండ్లేదే. అంతాకలియి కాలం శెడిపోతుండాదే యింగెట్లా ?

శెంది.— కాలంగాకుంటే - మంచీ శెడ్డా యిశారించేవోల్లు లేక యిట్లా పాడౌనా? ఓపిల్లోడునందు వోల్లయాడ సూశినా యీాడి ఆటా పాటాగా ఉండాదే గాని మన దేవుల్లు గీవుల్లు అంతా ఏమై పోయిర్రా?

ఎల్లు.— అంకాళమ్మా గింకాళమ్మా యీాళ్లంతా ఏమైరో? ఓరూ యీాణ్ణి సక్కబెట్రాదా? ఏఁ తోసకుండాది మావాఁ.

శెంది.— ఏంగాదోయ్. మన మిట్టుంటే సరిగాదు గాని ఱేపు రాత్రి అమ్మోరిగుడికాడ పొంగలెట్టి పూశ్శెశి కాపు కట్టి, మఱి జాత్ర శేస్తిమా అంటే ఆవేశం అమ్మ వారు అంతా తెలుపతాది. ఆపని శెస్తా మంటోయ్.

అందఱు.— అవు అవు చక్కం గుండాది - ఎల్దాం.

(నిష్క్రమింతురు.)

శ్రీ

# ప్రథమాంకము - పంచమరంగము.



స్థలము : ఊరిపైట గుడికిముందు.

(7 జాళ్లు అమ్మవారు, ఇతరపూజాద్రవ్యములతో మాలలు ప్రవేశింతురు.)

పూజారి.— అంతా తయారుగుండదా. ఇంకా కానిత్తామంట్రా?

శెంది.— కానియ్యండయ్యా కానీండి. బిక్రీన కానీండి.

పూజా.— ఏ యీా తాంబూలాలు. దచ్చిన - పాణకం కుండ
ల్లో అద్దదణా. ఎలనీరు మీాదంతా పైసా పైసా-
ఇంకా నాకు శేరాల్చిందంతా ఉండాయా?

శెంది.— ఉండాయి మా రాజా.

పూజా.— ఇందులో మామూలు తప్పితే అమ్మోరికి కోప
మొస్తుంది. మాదిగల మామూలు మాదిగలకు;
మాలల మామూలు మీాకు. మరి మామామూలు
మాకూను.

శెంది.— తెల్సు తెల్సు సామి.

మాదిగ.— సామీా. మామామూలేంటిసామి. తెలిగాక అడ
గతాం.

పూజా.— తెగిన మేకపోతుల తలకాయలన్నీ మీాయి. మీా
రెందరున్నా మన్శికి నాల్గేశి ముంతలు కల్లిల్లు, రెం
డేశి రూకలు, పదేశి తాంబూలాలు. రెండుపళ్లు
బియ్యం. ఎన్ని తెగినా పదికోడిపుంజులు.

మాదిగ.— ఆం అద్దది మారాజా. నిరుడు పూజ్జేశి సాలా యే

గేశేరు. మా మామూలు మామూలే, తప్పరా
దు.—ఏఁ మఱేఁగోటి మాకు, నానుఁపప్పు, సరి
మిడికూడా యియ్యాల్నండి.

శెంది.— ఇద్గో సామి. శివాలుసక్కంగా శెప్పాలె. తెల్సె.
నా. అట్టుంటేనే యినాము లిచ్చేది.

పూజా.— ఇగ కానిత్తామంట్రా ?

అందఱు.— కా నిండి, కానిండి.

పూజా.— ఓహొహాయ్... కిలారించండి కిలారించండోయ్.

[అందఱును కిలారింతురు]

పూజా.—

యదుకులకాంబోది - ఆదితాళము.

పోలేరమ్మా పోతురాజా - కలియేలమ్మా కాటేరి.
మాతంగీ యో శౌడమ్మా - భద్రకాళి మహాకాళీ తల్లీ,
బేతాళా వో మల్లక్కా - వీరభద్ర వో చెంచక్క,
శాకిని డాకిని లంకిని యో - చాముండమ్మా శెంగమ్మా
శెంగాళమ్మా కుట్టిశాత్తాఁ - రేణుకాంబ వో గంగమ్మా
జంబిని యక్షిణి మన్నారు - అంకమ సప్తకన్నెలారా.

[అందఱు ననుకరింతురు.]

పూజా.— ఇక వుడుకు వోయించండోయ్ కూకోని.

[నందుఁడు ప్రవేశించును.]

శెంది.— అయ్యోరా, ఇద్గో నందు డొచ్చాడు. బాగా ఆవే
శం ఆడి చెప్పాలె.

నందు.— మూఢులు. ఎంత చెప్పినను వినరు. ఎన్ని జీవహింసలు?
ఎంత పాపము? ఇవన్నియు, తరించుటకు దారులా;

పూజారి పొట్టపోసికొనుటకేగాని? ఆవేశము చక్కఁగా నాడవలయునఁట — ఇంత కష్టమును ఏఖర్చును లేని మార్గముగదా నేఁ జెప్పునది. కాని, ఏమి జరుగునో చూతము.

శెంది.— అందఱును మరింత నీలు పుచ్చుకోండోయ్. కర్పూరం ఎలిగించండి. శివాలు శివాలయ్యోవ్.

[కిలారింతురు.]

శెంది.— నంబా, చెప్పుకో యిప్పుడు నువ్వేం శెప్పుకుంటావో. అమ్మోరువొస్తావుండాది పూజారాయనకు బదులు.

(గేయము.)

పూజా.—పొలి మేరకాడనుండే బాలనాగమ్మతల్లీ-
కల్ల గాదంచు పల్కు- చల్లగా బల్కువమ్మా||

నీలాంబరి రాగము.

నందు.— కల్లమాటలకు నేల- కల్లదేవుళ్లఁ బిల్వ-
అల్ల మమ్మెల్లఁ గావఁ - దిల్లయంబలుండు గలఁడే||

పూజా.—సుంగుపాగాను సుట్టి - కిర్రుశెప్పులను మెట్టి ;
శెంగాయి దట్టిగట్టె - మదురయీరప్పదేవా||

భైరవి రాగము.

నందు.— గంగాధరేశు మనము - పొంగుచుఁ గొల్తు మేని
మంగళం బిచ్చి మనల - చల్లంగఁ గాపాడునయ్యా||

పూజా.—పోతురాజయ్యదేవా - పోతు బలులిత్తుమయ్యా||
శిత్తంబు మార్చవయ్యా - జాతిదైవంబు గొల్వ||

నాట కురంజి.

నంద.— సత్తింతయైనలేని - భూతముల కొల్వమాని
చిత్తంబులోనఁ బూని - జ్యోతి మయుఁ గొలుఁదూని||

ఆవేశము.— (ఆవేశముతో) ఓహెూయ్, ఓహెూయ్ (అనుచు నూగును)

పూజా.— అమ్మ, తల్లీ. నూ వెవరు?

ఆవేశ.— (పండ్లుకొరుకుచు వేపాకు నమలుచు కోపముతో) నన్నెఱగరంట్రా ఎఱగరంట్రా, నూడండేమి శేస్తానో? మిమ్మంతా ఓటేవారి—

పూజా.— హా - హా - హా. - అమ్మ. తల్లి. వొద్దు. వొద్దు. చల్లని చూపుచూడు. తల్లి. ఏటలిస్తాం. పొతులిస్తాం. పొంగళ్లెడ్తాం. బలెడ్తాం జాతిర్లు శేస్తాం. ఏదిరా. కర్పూరం ఎలిగించండే, కాసిండి. తెగేయండి—

[లోపలశబ్దము. తర్వాత నెత్తుటిచేతితో నొకడు ప్రవేశించును.]

ఆవే.— నిరుడు నాకు సక్కంగా జాతర శేయక, బలెట్టక అంపేశారు.

పూజా.— అమ్మ,తల్లి- బుద్ది బుద్ది.సల్లనూపు. సల్లనూపు-ఈపాలంతా శేసేస్తాం.

ఆవే.— నే నెవరు తెల్సునా?

పూజా.— తెలవదు తల్లి.

ఆవే.— అంకాళమ్మ.

పూజా.— బుది బుద్ది దండాలు.

ఆవే.— నన్నెందుకురా పిలిశారు?

శెంది.— అడగండయ్యా నందాయు సమాశారం.

పూజా.— తల్లీ_ ఈమాలవాడలో పుట్టి పెటిగి అల్లద్దో నిలుచుండాడే. నందయ్య-వాడు మావాడ మామూళ్లు

యిడిశి, శివ శంకర, అంటా ఏంశేంటో శస్తా శిదంబరం శిదంబరం అంటా మాదేశ్ళంతా కల్ల దేవుళ్ళంటుంటాడు. ఆడికి బుద్దొచ్చి నిన్న కొలిశేట్టు శెయ్యాలే తల్లి.

అందఱు.— ఆఁ. అడ్డది. అడ్డది.

ఆవే.— ఓహోయ్‌- ఇవండి. ఆడు శెడితే శెడ్డాడు; ఆణ్ణి వొల్లికాటిరుద్రుడు పట్టుండాడు, వొదలడు. ఆడి జోలికి బోకండి. ఆని జోలికెల్తే మీకంతా కష్టం— అయినాగాని నాకు పెతిఆదారం. పొంగలెట్టి పడే శియేటలు బలిస్తుంటే అంతా సక్కపరుస్తా.

పూజా.— ఆ ఆ ఆ. అట్టె అట్టె తల్లి.—

నంద.— వీరికోలాహలమున నేమి చెప్పినను వినువారు కారు. దూరమున నుండి యేమి జరుగునో చూచుచుండెద.

[దూరముగా వెళ్లును.]

ఈరి.— ఏయిఁరా. నందా. ఏంశేంటో శెప్పేవోడివి అమ్మో రితో పల్కు తెలస్తది. ఏడోఁయ్‌. ఆడేడీ?.

శిద.— ఆడప్పుడే యెల్లిపోయె బయమేశి.

శింగి.— సూస్తివా. ఆనికి బయ్యం.

పూజా.— ఇక సాలునంట్రా?

శింగి.— సాలు సాలు అమ్మోర్ని కొండెక్కించమనండయ్యా.

పూజా— (కర్పూరహారతి చేయును, ఆవేశగాఁడు అడి క్రిందఁ బడును.)

శింగి.— అమ్మోరికి ఎక్కువ సీలిచ్చుకొండోయ్‌.

[అందఱు త్రాగుదురు.]

(నందుఁడు ప్రవేశించి పూజా ద్రవ్యములఁ జిందఱవందర గావించి అందఱను పైఁబడి తన్ని పాఱఁ దోలును.)

ఈశ్వ.— (మరలఁ బ్రవేశించి) ఇదంతా గాదోయ్. నాకిం కోటి తోస్తుండాది. రేపు పయిటాల బాపనయ్యవోరికాడి కెల్లి ఈనిసమాచారం తెల్పాలె. ఆయన నాల్గుపెడితే అప్పుడు అన్నీ కుదురుతది. శేస్తామంటోయ్ ?

అంద.— అట్లే చేస్తాం, పదండి.

[అందఱును నిష్క్రమింతురు.]

నంద.— వీరికి సన్మార్గము త్వరగా పట్టువడదు; వారిగతి యది. ఈఘోరకృత్యములఁ జూచినపాపము హరించుటకై ఈశ్వరునిఁ బ్రార్థింపఁ బోయెద.

[నిష్క్రమించును.]



శ్రీ ర స్తు.

అ వి ఘ్న మ స్తు.

# న ం దు ని చ రి త్ర ము.



## ద్వితీయాంకము—ప్రథమరంగము.

స్థలము, మిరాశీదారునింటి వెలుపలిభాగము.

[ఉయ్యాలపై బ్రాహ్మణుడు కూర్చుండియుండును. భార్యకృష్ణమ్మ తములపాకులు మడిచి యిచ్చుచుండును.]

బ్రాహ్మ.— సుబ్బయ్య వచ్చినాడా ?

భార్య.— లేదు.

బ్రాహ్మ.— మఱి నేటిక్షౌరము ఎవరుచేసిరి?

భార్య.— మీరు చెప్పండి.

బ్రాహ్మ.— నీవు చేస్తివా?

భార్య.— బాగున్నదా ?

బ్రాహ్మ.— బాగుంటేనే అడిగింది. నీవు చేస్తావా ?

భార్య.— అవును.

బ్రాహ్మ — నీ వెప్పుడు నేర్చుకొంటివి ?

భార్య.— సుబ్బయ్య చేస్తుండగా చూచి నేర్చుకొంటిని.

బ్రాహ్మ.— అయితే యిన్నాళ్లల చెయ్యలేదు ?

భార్య.— బాగుంటుందో లేదో అని యిన్నాళ్లు భయంగా ఉండింది. ఈవేళ అయినా గాని చూస్తా మని

తెప్పించినాను. నిజంగా బాగుండిందా, ఎగతాళా ?

బ్రాహ్మ.— నిజంగానే బాగుండింది. రేపుకూడ చెయ్యి.

భార్య.— సరే. ఈవేళ యిది చేసేటప్పటికే యెంతో కష్టమయింది.

బ్రాహ్మ.— ఎందువల్ల ?

భార్య.— అక్కకు యిది యిష్టములేదు.

బ్రాహ్మ.— ఎందుకు ?

భార్య.— నెయ్యి, గోధుమనూక అన్ని ఖర్చవుతుం దట. ఇంకేమేమో అం టుంటుంది.

బ్రాహ్మ.— ఇంకా యేమి?

భార్య.— దూబరదిండితన మట. ఎప్పుడుచూచినా తినడమే. సంసారము యేట్లో కలిశిపోతుందట. నెత్తిమీద గుడ్డ వేసికొనవలసిందే నట. ఇంకా యేమేమో తిండి తిండిగా, నేను నేనుగా దివాలా తీస్తారట మీరు.

బ్రాహ్మ.— పిచ్చిది. ఎక్కడనో శుద్ధదాృభలయింట్లో కాపరం చేసి అత్తవారింటిగుణాలు బాగా పట్టుబడ్డవి. కడుపుకు తినక కాల్చుకోవలె కాబోలు.

భార్య.— అదేమో. ఈఖర్చంతా మరింత నేలలమీద వేస్తే బాగుండదా అని అంటుంది, నిజమేగదా?

బ్రాహ్మ.— అవును. నిజమే. ఇప్పు డుండే నేలలు అనుభవించే దానికి మనుష్యులు లేరు. ఇంకా నేల లట భూము లట? ఉండేది ఆలుమగడు చల్లంగా అని మన మిద్దరము, అమ్మాయి ఒకతె. ఎందో ఉన్నన్నాళ్లు

బాగా తినవలశినది. మంచిగుడ్డలుకట్టవలశినది. నలుగురికి పెట్టవలిశినది. ఇంతకన్నా వేరే అనుభవము లేదు. ఆత్మ తృప్తిపడవలిశింది ముఖ్యము. అది తృప్తిపడితే అన్ని దైవాలకు తృప్తి.

భార్య.— ఏమి యీవేదాంతం మాటలతో?

బ్రాహ్మ.— మాటలుకావు, నాయేర్పాటు చెపుతా విను. మనసు తృప్తిపడేదానికి ఎన్నివిధాల చెయ్యవచ్చునో అన్ని విధాలు చేయవలశింది. అది —

భార్య.— ఇట్లాటివారు నాకు ఎన్నాళ్లుగా చెప్పుతున్నారు రవ్వలడ్డిగ తీశియిస్తా నని?

బ్రాహ్మ.— నీ వడిగేదంతా యిప్పటికి నెల రెణ్ణెల్లుగానే కదా. ఈకోత కానీ తీశిస్తాను.

భార్య.— దానికేమి యిప్పుడు తీసుకుంటే పైకం కోతకాగానే యిస్తానంటే ఒప్పుకుంటారు.

బ్రాహ్మ.— నీవు గడుసుదానవు. సమయంచూచే ప్రస్తావిస్తావే. ఊఁ సరేకాని, మన సెట్టిరానీ, చెప్పి తెమ్మందాము.

భార్య.— ప్రొద్దున మీరు పొలంమీదికి వెళ్లివుండినప్పుడు సెట్టి వచ్చియుండెను. అడిగితిని. ఉన్నదని ఒకటి యిచ్చినాడు. ఎవరికో జమీందారులకు రెండు చేస్తే వారు యిప్పుడు ఒకటే చాలు నన్నారట. ఆరెండవదేనట యిది, చూడండి. (ఇచ్చును) ఇప్పుడు వస్తా నన్నాడు.

బ్రాహ్మ.— (చూచి) ఇది చిన్నదిగా ఉండునేమో వేసుకొని చూస్తివా?

భార్య.— చూస్తిని. ఇప్పుడు కావలిస్తే మీరు చూడండేమి?

బ్రాహ్మ.— (మెడలోవేసి) సరే బాగున్నది. ఏమి వెలట?

భార్య.— ఎనిమిదివే లట.

బ్రాహ్మ.— ఎనిమిదివేలు?

భార్య.— ఎనిమిదివేలే. మహాప్రమాదం. మన యీడువారి యిండ్లకు పోతే ఒక్కొక్కరు వేసుకొని ఉండేది చూస్తే మహాసిగ్గుగా ఉన్నది. గోపాలయ్యగారి భార్య మెడలోని పతకమే పన్నెండువేలట. రామస్వామయ్యగారి భార్య ముక్కుపుడక పదహారువేలట. వారింటిబిడ్డ మెడలో ఉండేపతకం ఎనిమిదివేలట. వారేమి మనకన్న ఎక్కువవారా?

బ్రాహ్మ.— పైకం పోతుందే ఎక్కువే అని కాదు. నీకు యిప్పుడు తీస్తే, మరి అమ్మాయికీ ఒకటి తియ్యవలెనా? ఇక నది అత్తగారింటికి పోవలసినదినాలు సమీపిస్తున్నవా? రెండేండ్లుగా పంట చక్కగా లేదు నీ వెరుగుదువు. మన రైతులందఱికి అప్పిచ్చియున్నాము. అమ్మాయికి ఓలివరుసవగైరాల కెంత లేదన్నా యిరవైవేలన్నా కావలెనా? ఇప్పటివరకు మన అమ్మాయికి పట్టుమని ఒక పెద్దనగ లేదు. అన్నిఖర్చులు చేరితే తట్టుకోగలమా అని యోచన.

భార్య.— ఇట్లంతా యోచనచేస్తే అయ్యేదికాదు. ఈసారి కాకుంటే పైసారికన్నా అప్పు తీరుస్తాము. నాకేమో

యీఅడ్డిగమీద మోజుగా వుంది. ఇద్దరికీ తీసివ్వండి.

బ్రాహ్మ.— సరి. అయితే కాని నీమనసు కెందుకు కొదవ.

నౌకరు.— [ప్రవేశించి] అయ్యా, సెట్టి వచ్చియున్నాడు.

బ్రాహ్మ.— రమ్మను.

[నౌకరు వెళ్లి సెట్టిని పిలుచుకొని వచ్చును.]

సెట్టి.— దండాలండి దండాలండి. అడియేన్ అడియేన్, దాసానుదాసన్.

బ్రాహ్మ.— కూర్చోండి సెట్టిగారు.

సెట్టి.— అడియేన్ అడియేన్.

బ్రాహ్మ.— ఏమండి, మీరు పెద్ద కలహం తెచ్చిపెట్టినారు?

సెట్టి.— రామానుజ రామానుజ, కలహమా?

బ్రాహ్మ.— ఔను.

సెట్టి.— రామానుజ. రామానుజ. నే నే మెరుగనండి.

బ్రాహ్మ.— ఎరగరా? మఱి చూడండి. చేత పైకం లేనప్పుడు అడ్డిగ తెచ్చియిస్తిరి. ఆడవాళ్లు కావలెనని మూర్ఖం చేస్తున్నారు. ఈసంవత్సరం పైకానికి కొంచెంకనాలా.

సెట్టి.— రామానుజ. రామానుజ అడ్డిగనా? సరి. ఏమిరా అపచారం అనుకొంటిని. సరి. అదేమండి అట్లా సాయిస్తారు? మీదగ్గర ఒకమంచిబేరం చెయ్యవలె నని అడియేన్ శానాదినాలుగ ఉంటిని. అమ్మగారు మంచిఅడ్డిగఒకటికావలె అంటుండిరి. ఇది మంచిసొత్తు. అమ్మగారు తాయార్లవలె. —రాజుసంస్థానానికి రెండుచేయిస్తే ఒకటి తీసుకొని ఒకటి వ

ద్దన్నారు. ఎప్పుడెప్పుడు వారామాట సాయిస్తూ రా అని ఉంటిని. అది మనవద్ద ఉండవలసిందండి. ఇది-నాకు యెంబెరుమానారు సన్నిధివంటిది. పైకాని కేమి మీ రెక్కడ పోతారు? నే నెక్కడ పోతాను?

బ్రాహ్మ.— మీరు అసాధ్యులండి. ఖర్చుకాసిదాన్ని మానె త్తిని కడితిరి.

సెట్టి.— రాము. రాను. ఆరామునితోడు దోషం లే దనండి. అడియేఁ అట్టాంతా తమవిషయంలో పొరబాటు చెప్పేవాడు కానండి. నాసమాచారం - ఆ - అ దేమి మీరు మొగం తెలియనివానివలె సాయి స్తారే? ఇది మంచి ఉలాందాలు నూట యిర వై యెనిమిది పట్టలు తీర్చింది. కట్టడానికే ఆరునెలల యింది. అది యింటికి వచ్చినవేళ చూడండి. మనయింట్లో శుభకార్యాలు జరగవలె. ఇంకామంచి గిరాకి రావలె. మీరు మరేమి అడ్డం చెప్పవద్దండి. అమ్మగారిమనసుకు ఏమీ కొదువవద్దండి.

(అన్నపూర్ణమ్మ ప్రవేశించును.)

అన్నపూర్ణ.—అమ్మా, అమ్మా యిటురండి యిటురండి, మీకు మనముడు పుట్టినాడు.

భార్య.— మనముడా?

అన్నపూ.— ఔను. వేగరం రండి (లోపలివైపు చూచి) పెద్ద కూటం అరలోకి తీసికొనిపొండి వస్తున్నాము. (కృష్ణమ్మతో) మన అమ్మాయి—

బ్రాహ్మ.— అమ్మాయి యేంద— మనము డేందమ్మా?

భార్య.— ఏం దమ్మా?

అన్న.— ఈ కాలం వాళ్లకు అన్ని తెలుసును. ఒకటీ తెలియదు. మన మీనాక్షి సమర్తైంది.

భార్య.— మన మీనాక్షా? ఎప్పు డెప్పుడు?

సెట్టి.— చూస్తిరా. నామాట ఎప్పుడు పొర్లుకాదండి. అది సత్యం.

భార్య.— పోదాం (అన్నపూర్ణమ్మతో) పద.

[కృష్ణమ్మయు అన్నపూర్ణమ్మయు నిష్క్రమింతురు.]

సెట్టి.— దినవారా లన్నీ బాగుందాండి?

బ్రాహ్మ.— ఇకమీదకదా విచారించవలెను. మాపురోహితులను పిలిపించవలెను.

సెట్టి.— మన అల్లుడు యిప్పుడు యెక్కడ వున్నారండి. ఈ ప్రయోజనానికి రావలసిందే కదా ఆయన.

బ్రాహ్మ.— ఔను, రావలశిందే. ముందు వారికి శుభం చెప్పి పంపవలె. అంతా చాలాపను లున్నవి. అక్కడిసందర్భా లెట్లున్నవో?

[కృష్ణమ్మ ప్రవేశించును.]

బ్రాహ్మ.— ఏమది?

భార్య.— మన మీనాక్షి సమర్తయింది. పెద్దపడసాలలో అరలో కూచో పెట్టి వచ్చినాను. కావలసిన సామానులన్నీ తెప్పించవలె.

(ఆడుబిడ్డ రంగమ్మ ప్రవేశించును.)

రంగమ్మ.— ఊరికే లేనిపోని జంఝాటకం పెట్టుకోవద్దు. సాంగ్యం పోనీక అయిందాంటే అయిం దనిపించండి. దానికేం, పట్టి జంభాలకు పోవలె నని లేనిపోని ఖర్చులు పెట్టిస్తుంది. పోయినవరాత్రికి చూడలా? ఇంట్లో పెద్దదాన్ని నామాట విని అంతా అయిందా అంటే అయిందనిపించండి.

భార్య.— నాకేమి? నే నేమీ చెప్పలేదు, అది కావలె, ఇది కావలె అని. మీయిష్టం యెట్లో అట్లే కానివ్వండి. మీకులేని పరువుప్రతిష్ఠలా నాకు? నేనేమి వచ్చిందాన్నే కదా.

శాస్త్రి.— నీవేమిటి చెప్పడం? ఇంకా యేంచేసేది. ఏమి కావలిసింది ఆవిషయం ఏమి ప్రస్తావనే లేదే? ఇంతలో నీమనసులో నీ వేమో తలచుకొని కోపపడుతున్నావు.

రంగ.— కోప్పడుతున్నానా? అంతా మీరు పోయిందే పోకలా? కొంచెమన్నా యిల్లు వాకలి సంసారం ఏకీ యోచనలేదు. అన్నీ దూబరదిండితనాలేనా? నేనమత్తయినప్పుడు మానాయన తుదకు పేరంటం కూడా పిలవవద్దన్నాడు. ఊరికే మేళాలు తాళాలు మకరాలు అంతాచేస్తూ నెత్తిమీద గుడ్డవేసుకొనేపని చేయబోకండి. కాపరానికి వచ్చి పట్టుమని యింకా పదేళ్లుకాలేదు. అప్పుడే స్వాతంత్ర్యం. మట్టు మర్యాద లేక ఎవరంటే వారి ముందు నిలుచుకొని

మొగునితో మాట్లాటం బాగుంది; వృద్ధికి రావచ్చు
ను. దానికి తెలివిలేకపోయినా నీ కేమయింది?
మంచి—

బ్రాహ్మ.— అక్కా ఇదేమీ బాగుండ్లేదు.

రంగ.— బాగుండ్లేదా?

బ్రాహ్మ.— అవును. ఇదుగో నే చెప్తావిను. ఇట్లాటిమాటలు చక్కగా ఉండవు. పెద్దదానవుగా ఊరికే ఒకచోట కూర్చొని ఉండు.

రంగ.— ఒకచోటనే కూర్చుండడానికి నేనేమి కఱ్ఱమొద్దునా? బండనా? అంతా వెఱ్ఱిపోకలా?

నాక.— [ప్రవేశించి] స్వామి- మనమాలలు వచ్చియున్నారు. అరుస్తూ మిమ్ముల నేమో అగత్యం చూడవలెనని అంటున్నారు.

బ్రాహ్మ.— రమ్మను.

[మాలలు ప్రవేశింతురు]

గేయము. ఆదితాళము.

మాలలు.

అయ్యా వోక మనవిగద, మన నందుని చరితమెల్ల నదియేమో - మతీ
మతి చెడిపోయెఁ॥ అయ్యారో॥

వాడలో, లేని పోని, వాదుకలఁ దెచ్చి పెట్టెఁ - వలసపోవుదు
మయ్యా॥ అయ్యారో॥

మతిమతి వెఱ్ఱివాని చందమునఁ జూచి చూచి - విఱ్ఱవీగుచునుండుఁ॥
అయ్యారో॥

అల్లవాఁడు - తిల్లకు మమ్మెల్లఁ దిరునాళ్లఁ జూడ రండని యల్లరి చే
యుఁ॥ అయ్యారో॥

అట్టివాఁడు కట్టెఁదీసి కొట్టునంచు భయమందుచుఁ - పలుకుదు
మెటు లెటులో॥ అయ్యారో॥

అవ హీనముగాదా మాకు మానము లేదా - మాదేవుఁడు పోతురాజే॥
అయ్యారో॥

మాదాసర్లతోఁడఁ గూడి, సోదె లడిగినాము - మోసము గాదయ్యా -
అయ్యారో॥

వొల్లకాటి రుద్రుఁడీణ్ణి - వొచ్చి యట్టే - పట్టినా డంట - వొదిలి
పోవడంటా - అయ్యారో॥

వొదలడంట - కదలడంట - మెదలడంట - తుదిదాక వదలి పోదు
మయ్యా - అయ్యారో॥

బాశిష్ఠ.— ఆహాఁ. అటులనా? అంతకాతర మాయెనా వెధ
వకు? ఏమియు తెలియని సాధు వని యెంచి యుంటిని
వానిని - అట్టివాఁడు మీావాడ కట్టుదిట్టములు బాసి
చిదంబర మేగునటనా? రెండురోజులుగా రాకుండ
గా ఒళ్లుచక్క లేదు కాబోలు ననుకొంటిని. అది ని
జమేనా?

శెఁదిరి.— స్వామి. మఱేమి లేదు. సక్కంగా- దిట్టంగుండాడు.
ఇటీయల కొన్నాల్లుగ రేప్రుటాల్లో యాణ్ణో అవు
పడకుంటే శేనికాడో, యేటిసాయో గొడ్డుగోదలకు
పచ్చికోకి అంటుణ్ణా దేవరా - అంటుణ్ణామూ-సా
మీా- మారాజులు మమ్ము న్యాయాల, బుద్దిబుద్ది.మ
న్నించాలా- ఆడు శేశినతెప్పు. మాకేం తెలవదు.
సామీా యాడ కెల్తాడ్రా అంటా ఓనాడు. అల్లా
యేపమానిశేసు అయ్యవారుండారా, ఆ అయ్యవో

రింటికాడా అదేంటో సదవతా కతచెపుతారే ఆడ అది యింటా దూరంగా నిల్చదున్నాడు, మొన్న సుక్కురారంనాడు. ఆణ్ణి పట్టి అట్టె అందరు అడుగుదుం గదా మమ్మల్నంతా గెదమాయించి మాలో పదకొండుమందిని, యెంటయేసుకొని అల్లా తిరుప్పంగూరి కెల్లొచ్చినాడు సామి. ఒల్లూ లేదు. గిల్లూ లేదు.

బాృష్ట.— తిరుప్పంగూరికి వెళ్లివచ్చినాడా?

శెంగిరి.— ఔను సామి.

బాృష్ట.— ఇప్పు డెక్కడ నున్నాడు? నేడు పనికి పోయినాడా?

శెంగ.— ఇంటికా డుండాడేమో తెలవదు. మఱి మొన్న మాకులంపెద్ద తాతయ్యచేత శెప్పించినాం శానా దూరం. ఇన్లె సామి. నిన్నా రేపు మాదాసరయ్యను పిలిశి అంకాళమ్మకు పూజ్జేశి పొంగలెట్టి యేంటేం టో అంతా శేశినాం గాని, అదేంటో వొల్లకాటి రుద్దురు డంట, ఈణ్ణెపట్టినా డంట మారాజా.

బాృష్ట.— [ఆలోచించుట నభినయించి.] మఱిచితి — మఱిచితి.

ఉ. నేఁ డుదయంబు వాఁ డిచట నేగుపుతోఁ గపటంపుసుద్దులన్
ఆడుచునుండఁ బొమ్మనుచు నానతిచేసినఁ బోఁడు మూర్ఖుఁడై;
వాడకుఁ గానివాని కిఁక వా యధికం బని విందు, కంటి నే
వీడఁడటంచు, భక్తియుఁట వీనిఁ జిదంబర మేఁగనిత్తునే?

ప్రొద్దున నిక్కడికి వచ్చియుండెను. తోటకు పోయి కపిలెబానను మాదిగవాని కిచ్చి కుట్టుకొని రమ్మం

టిని పోయినాడు. వచ్చును- రాగానే విచారించెద. మీరు వెళ్ళండి.

నారి.— సామి. ఆడట్టుండటం మాకేం సక్కంగుండ్లా. ఎన్నాళ్ళ కాణ్ణుంచో సక్కంగా, యేఁయిఁలేక కుదురుగా ఒస్తుణ్ణ యీమాలాడకు సామీ యినాళకాలం యీడివొల్ల పుట్టింది, మారాజా. మేము ఇంగా బతక లేము.

రాగము మోహన. మిశ్రయేక తాళము.

బెబ్బులి చందము బిబ్బరించాడుౘ
అబ్బా మాయబ్బా యీదబ్బర యేమో.
గొబ్బున శివ యని దబ్బం డబ్బుంచుౘ.
దబ్బకున్న మఱి దెబ్బల నాడుౘ.
శెబ్బరగాడయ్యా - గుబ్బరాలులతో.
అబ్బబ్బ తబ్బిబ్బు - తొడ బెల్ల మిడుగా॥

బాశిష్ఠ.— సరి మీరందఱు వెళ్ళండి; నేను వానిని చక్కగా విచారించెదను శిక్షించెదను. అంత పోతరమా వానికి? చిదంబరమును గిదంబరమును-బండకొయ్యకు వేయిస్తా నీవేళ రాని.

[అందఱు నిష్క్రమింతురు.]

రంగష్ఠ.— చూస్తిరా - విలయాలు- ఇవి అంతా చూచు కొంటావా, ఇంట్లో వేడుకలు చూచుకొంటావా?

బాశిష్ఠ.— అక్కా, నాకోపము వచ్చును. నీపని చూచుకొని వెళ్లు. ఆదరిద్రులయింట్లో యేమని కాపురం చేసినావో

గాని అంతా ఆదరిద్రపుయోచనలే. నిన్ను కాదని ఒకమూల పడియుండు పో.

పు. గ.— ఏకీడ యెట్లా పొయ్యైపోతే నాకేమి? చక్కపడేదారి చెప్పితినేగాని. సరిసరి - చెడిపొయ్యేకాలం, నాకేం నాదారిని నే పోతా. (అని కోపముతోను దుఃఖముతోను ఎదుటవచ్చెడు పురోహితురాలిని త్రోసికొనుచు వెళ్లిపోవును).

[సుబ్బమ్మ ప్రవేశించును.]

సుబ్బమ్మ.— అమ్మా పేరంట్రం యెక్కడెక్కడ ఏమని పిలవమంటారు? కావలసినవస్తువు లంతా తెప్పించారా?

భార్య.— మాకేం తెలుసును? అప్పుడనఁగా చెప్పిపంపితే యిప్పుడొస్తున్నారు. ఏమేం కావాలో వచ్చి చెప్పితే గదా?

సుబ్బమ్మ.— విస్తట్లో అన్నంపెట్టుకొని కూర్చొని కలుపుకొని ఒక్కముద్ద నోట్లో వేసుకునేటప్పటికి మన అమ్మాయి సమర్తయిందని విన్నాను. తీరా మజ్జిగన్నం తినేప్పటికి మళ్లీ పిలుస్తున్నా రని అంటే ఆదాబాదా రెండుమెతుకులూ నోట్లో వేసుకొని చెయికడుక్కొని ఎంగిలాకెత్తి దొడ్లో పారవేసి అలికేందుకు పేడచూస్తే పేడలేకపోయింది. మరి కావేరమ్మగారింటికి వెళ్లితే తద్దినబ్రాహ్మణులు భోంచేస్తున్నారు, ఎత్తుకో పోకూడ దన్నారు. ఆఁ అంతా ఆచేత్తోనే ఎగవవీధికి కనకమ్మగారింటికి వెళ్లియింతపేడ తెచ్చుకొని వస్తుగదా కుక్క ఒకటి

వంటయింట్లోనుండి బయిట వస్తుణ్ణింది. ఏందాకిందో యేమో నని వంటయింట్లో చూస్తే అన్నం తపెల బోర్లపడుణ్ణింది; మజ్జిగ ముంటిగ దొర్లి నే భోం చేసిన చోట పడుణ్ణుంది.

బాలిష్ఠ.— పోనిత్తురు. ఇక జరగనలశింది చెప్పండి.

సుబ్బ.— మంటియిక జరగవలశిందేమి? ఆఅన్నంకాస్తా కుడితితొట్లో పారవేసి తప్పాల తోముకొని నిప్పులో పొర్లించి మంటిగను దొడ్లో పూడ్చాను.

బాలిష్ఠ.— మనయింట్లో జరగవలసిందేమి?

సుబ్బ.— అన్నీ చక్కాగా నే జరగవచ్చును. నేనేమి మళ్లీ స్నానం చెయ్యలేదనుకొన్నారా? సుద్దికాస్తా పెట్టి యేటికి వెళ్లి గుడ్డ లుతుక్కొని స్నానంచేసి మడుగు బట్టకట్టుకొని బొట్టు పెట్టుకొని యిదిగో మీరు కోప్పడుతారేమో నని దబ్బున వచ్చానండి.

బాలిష్ఠ.— అది కాదమ్మా, మంచిచాదస్తంగానే ఉన్నది. ఇప్పుడు మనయింట్లో జరగవలసింది యేమి?

భార్య.— సరి, ఇక మీపురాణ మైందా?

సుబ్బ.— మీకేం లౌక్యలు; మమ్మల్ని వైదికులను చూస్తే పరిహాసం. అరుస్తారని మనకు శానా కావలశినవారేఅని ఆదాబాదా ముగించుకొని వచ్చాను, పసుపు గూడా చక్కాగా పూసు కోకనే. స్నానానికిపోతూ అవసరంలో అది కాస్తా మంటిచాను. మళ్లీయింతమూరం రావలెనే అని ప్రొద్దున బండమీాద రా

చినపసుపుకొంచెం అంటుకుంటే దాన్ని ఆతడిచేతు
ల్తో రాచిపూసుకొని నాల్గుమునకలుపెట్టి వచ్చాను.

బ్రాహ్మ.— మీ మునకలును, గినకలును, అవసరమూ పనీ తెలిసేదిలేదు. శుద్ధవైదికపు చాదస్తం. ఇక కావలసిందేమో శీఘ్రంగా చెప్పండి, పొద్దు లేదు.

సుబ్బ.— దినవారాలన్ని బాగున్నాయా? అమ్మాయి యేంచీర కట్టుకుణ్ణింది? ఇదుగో చూడండి, యిప్పుడే చెప్పుతాను. బీదవాళ్లం, మిమ్మల్ని ఆశ్రయించినవాళ్లం. అదిగోనండి ఆచీరెకాస్తా నాకు చేరవలశింది. పాడుముండ చాకలిది యెక్కడికి పోయినా నాకు దాయాది. దానిపేరూ మాఆడబిడ్డ పేరూ ఒకటే. అందుచేత ఆడబిడ్డతనంగా అన్నీతనకే చేరవలెనంటుంది.

భార్య.— పోనిత్తురు. కొత్తదే యిప్పిస్తాను. ఏమేం కావలెనో తెప్పిస్తా చెప్పండి.

సుబ్బ.— మీరు మహారాజులవలె పార్వతీపరమేశ్వరులవలె కలకాలం కడిపెడుబిడ్డలతో ఉండవలె. నే చెప్పేది వాడుక ఆచారమండి; కొత్తదిచ్చినా ఆచారం తప్పక ఆచీర వదలరాదండి.

బ్రాహ్మ.— సరే యిప్పిస్తాను, గాని ఆపైన?

సుబ్బ.— పాలుపండు యిప్పించారా?

భార్య.— అయింది.

సుబ్బ.— అదేమన్యాయమమ్మా? బుచ్చమ్మగారింట్లో పిల్లసమర్తయితే పాలూను పండూను యివ్వక యేదో

అంగట్లోనుంచి కొనుక్కొచ్చి యిప్పించారట. ఏమి కలికాలం!

బ్రాహ్మ.— ఇశ్శ్.

సుబ్బ.— మరి మాకరం గికరం కట్టించే యేర్పాటేమైనా ఉన్నదా?

బ్రాహ్మ.— అన్నీ యేమేమి కావలెనో చెప్పండి.

సుబ్బ.— మేళంగూడా ఉండవలెనండి. మొన్న గౌరీభాయి యింట్లో మేళంపెడితే మాపాటకు యెదురు పాడ నన్నాడు. మనయింట్లో తంజావూర్లోనుండి మేళ గాణ్ణి పిలిపించి చూడండి ఎట్టచేస్తానో నని నే చెప్పా నండి. కనుక మీరు మంచివాణ్ణే పెట్టించండి.

భార్య.— ఇంకా ?

సుబ్బ.— తమలపాకులు, వక్కలు, మంటి పండ్లు, టెంకాయలు, పసుపు, కుంకుమ, చిమ్మిలికి నువ్వులు, బెల్లం- ఇది గోనండి మీరు యిప్పటివారివలె అదంతా తూష్ణీం చెయ్యించొద్దండి. శాగా పెద్దవెలక్కాయలంటేసి వుంట లిస్తేనేగాని పసుపు గాదు.

[నౌకరు ప్రవేశించును.]

నౌకరు.— స్వామీ, నందుడు వచ్చి యున్నాడండి.

బ్రాహ్మ.— ఆహా వచ్చినాడా. సరే, యెదురుగా రమ్మను కం కను. సమయానికే వచ్చినాడు. గుమాస్తాను రమ్మను.

నౌకరు.— చిత్తము. (అని వెళ్లును.)

బాహ్మ.— (భార్యతో) అక్క యేమన్నా అన్నదని చెవిలో వేసి కోక పని కానియ్యండి. ప్రయోజనకాలం నలుగురు వస్తూపోతూ వుంటారు. తగువులుగ వుంటే నలుగురు నవ్విపోతారు. బాగుండదు.

భార్య.— అయితే నేను తగవు లాడినానా ?

[గుమస్తాప్రవేశించును.]

కృష్ణరావు.—(ప్రవేశించి) నమస్కారము స్వామీ!

బాహ్మ.— మన అమ్మాయి పుష్పవతి యైనది.

కృష్ణ.— సంతోషమండి.

బాహ్మ.— సాయంత్రములోపల శృంగారాలు మంచిమేళం యింకా యేమేమి కావలెనో అన్నీ సిద్ధం చేయించండి. ఇదుగో మన సుబ్బలక్ష్మమ్మగారు వివరం చెబుతారు. వెనక అక్క నడిగి యెవరెవరికి మనబంధుజాలంలో శుభలేఖలు వ్రాయవలెనో అన్నీవ్రాయించండి.

కృష్ణ.— చిత్తమండి.

బ్రాహ్మ.— ఈనాల్గురోజులూ మీరు యిక్కణ్ణే ఉణ్ణండి.

భార్య.— రుక్మిణీభాయమ్మగారిని ఈనాల్గు రోజులూ యిక్కణ్ణే ఉణ్ణించండి.

కృష్ణ.— చిత్తమండి.

బ్రాహ్మ.— మఱి నేను నందునితో మాట్లాడి వచ్చెదను.

[కృష్ణరావు వెళ్లును; నందుఁడు ప్రవేశించును.]

నంద.— స్వామీ,

రాగము : ఉసేని. తాళము : రూపకము.

తిల్లయంబల స్థలము గలదంట - అది గన్నవారికి
మఱి జన్మబాధ లేదంట||
గోపుర శిఖరములు గలవంట - కనుగొన్నవారికి
దాపున యమభటులు రారంట||
కాపురేని చూపు గలదంట - గోపురములోన
చూపరుల కానంద మౌనంట||
వేంకటార్య సన్నుతుం డంట - నటనేశమూర్తి
యంకితుండు భక్తులకంట||
పోవ నాకు ననుమతిచ్చి - ఓస్వామి మీరు
నావగం దీర్పంగ వేడుదు||

తిల్లయంబల మను నొక దివ్యదేశ మున్నదంట. అందు ఒక గొప్ప శివాలయ మున్నదంట. ఆయాలయమున నటనసభేశమూర్తి యున్నవారంట. స్వామీ, ఆ మూర్తిని దర్శనము చేసినవారికింక జన్మమే లేదంట. ఆ ప్రదేశమును చూచి యామూర్తిని దర్శించి రావలె నని నాకాశ పుట్టియున్నది. కనుక నాకు అచ్చటికి పోయిరాను సెలవీయ వేడెదను, స్వామీ.

(నమస్కరించును.)

బ్రాహ్మ.— నందా,

రాగము : శంకరాభరణము - తాళము : మిశ్ర ఏకము.

వాడవారల శివభక్తిచేయ ప్రేరేపించితో నియమించితో ?
రేపు మాపును వచ్చి యేగుచుండిన నది నేవయా నందినేవయా?
బానిసవాఁ డగు నీ కింత పోతరమేలరా? యిది చాలురా?
గంగజాతర సేయ నందఁజేరి ఖండించితో దండించితో?
తలక్రిందులైనను పిచ్చుక పక్షులరాజౌనా? యిది బాగౌనా?
నీపోకలట్టె నిన్విడుతునని మది నెంచితో గడిమించితో?
శంకలేక బానిసీని కీకోరిక యెట్టురా? మదిఁ బుట్టెరా?
వేంకటాచలనుతుఁ గొల్వఁగోరిన నిన్నుతిట్టరా - మఱి కొట్టరా ?

నీ కేమిరా, ఇంతగర్వమా? కొంచెమైనను పిన్నపెద్దలు లేక జాతినీతులు తెలియక వాడవారి కందఱికి తాచెడ్డకోతి వనమెల్ల జెరిచె నన్నట్లు నీవు చెడుటయేగాక శివశివయనియును శంకరా యనియును భజనజేయ ప్రేరేపించెదవా? కుంకా, రెండుమూడు రోజులుగా నీవు అగుపడకుండుటయే కాక ఇతరులను వెంటబెట్టుకొని నాతో చెప్పకయే తిరుప్పంగూరికి పోయితివా? నిన్నేమి చేసెదనో చూడు. కొఱతవేయించి యెముకలు విరుగతన్నించెద. ఊడిగపుమాల వానికి ఇంతపోతరమా? కొంచెమైన మట్టుమర్యాదలు లేవు. ఇకనైనా కుదురుగా నుంటావా లేక తలారివానిచే కొఱతవేయించేదా?

నంద.— స్వామీ, నే నేమి చేయరాని పని చేసితినో ? చేసి

లో నేచేయవలసిన పను లన్నియును చేసియే పో యితిని. స్వామీ, ఈజన్మము తరించుటకు తగినమార్గమైన ఆశివపరమాత్మను చూడఁబోయితిని గాని ఇఁక నే యపరాధమును జేయలేను.

వాశిష్ఠ.— ఆహా, దురాత్మా, అధికముగ మాటలాడెదవా? మాలవానికి శివదర్శనమా? నీ వేమి బ్రాహ్మణుడవు కాదలచితివా? బదులుకు బదులాడెదవా, చేసినది తప్పనక? కావలసిన మీదేవుళ్ల పూజచేసికొంటే చాలదా? అది లేక చాలని కొండనకు మీవారిని ఆక్షేపిస్తివా ?

రాగము - తాళము.

చిదంబర మేగకురా - వినరా - చిదంబర మేగకురా -
చిదంబర మేగిన - ఘనపాపంబగుదు వని - వదరెద వది నీజాతికిఁ దగునా ||
తప్పక ప్రయత్నములు - చేసుకున్నా, నీ - కపటమంత్రము నిటఁ జూపకురా ||
వాపోవకు - నీపలుకు బలియక - రాపాటుండు నాయెదుట నిలకు పో ||

ఇప్పుడు తెలిసెనో తెలియకయో చేస్తివి. మన్నించెదను. నీసమాచారములన్నీ తెలిసినవి. మరల నీపై యెవరైనా యేమైనా ఫిర్యాదు తెస్తే నిశ్చయముగా కొరడాలతో వేయించెదను. నిశ్చయము. పో. చిదంబర మనుమాట విడిచి దొడ్లో నామకట్టుచున్నారే వారికి సహాయముగా నుండుము పో.

నందా.— స్వామీ. నాపై నింత కోపించిన సిఁక నెట్లు? ఈదీనుని నింత కటిణాఁ జూడ వేఁడెదను. నాయీయొక్క ప్రార్థన

నంగీకరించి పెద్దమనస్సుచేసి ఊరక దర్శనమాత్ర మునసైన నన్ను కడతేర్చు మార్గము చూపి యేల రాదా? ఎన్నిపాపములో యొనర్చి ఈలోకమున నీ చండాలజన్మమెత్తినాఁడను. అయినను తమవంటివా రియొద్ద సేవకుఁడ నైతినని సంతోషించెదను. తమ్ము నాశ్రయించినందులకై నేను కడతేరు మార్గమును జూపి తాము పుణ్యము కట్టుకొనరాదా? నే దీనుఁ డను. అనదను. నన్ను రక్షింపుఁడు. మీ కిదే మ్రొక్కెదను.

[అని సాగిలఁబడును.]

భార్య.— ఏమో పోతాడు. మనపనివాడు. మనకు సంతోష కాలంలో వానికిని సంతోషం కలగనీయండి.

బ్రాహ్మ.— ఇవన్నీ మీసమాచారములు గావు ఊరొకనుడు. అందువల్లనే పనివాండ్లు అణిగిమణిగియుండకుంటుంటి.

రాగము : మోహన - తాళము : ఆది.

ఓరి నందా - నీవు చిదంబర మని యనఁ దగునఁటరా

పోఁ దగునఁటరా॥ ఓరి॥ సరియా-

నేరక యంటివి - నినువిడిచితి నిఁక

మరల పల్కినను - నెట్టుదు - కొట్టుదు॥ నందా॥

చిదంబర మన విడఁగోరు - పద పో నాటుము నారు

మొలక లెత్తవలె కారు - మాటాడక యిఁక పోరా-ఔరా॥నందా॥

నందా, నీదుర్మార్గము లిపుడు తెలిసె. ఎదుట నిలువకు. రేపుదయమున తూర్పుకయ్యలు నాటవలెను. వేప

చేనులు దుక్కి చేయవలెను. ఈయేడు వాన తక్కువగుటచే సర్కారుకు పైకముకట్టుటకు కూడ చాలినంత పండునట్లగుపడదు. కష్టపడి పని చేయుము. పొమ్ము. నీతో నేను మాటాడలేను. నాకు వేరే పని యున్నది. నేను వెళ్లెదను. పో. పో. నీవు కుదురుగా నున్నావను సమాచారము వినువఱకు నీముఖము చూడను. నిలువకుము, పో పో.

[నిష్క్రమించును. యవనిక పడును.]



## ద్వితీయాంకము—ద్వితీయరంగము.



స్థలము : బ్రాహ్మణునింటి కూటము.

కృష్ణమ్మ.— ఏమమ్మా! సుబ్బలక్ష్మమ్మగారూ! పేరంటమంతా పిలిచయిందా?

సుబ్బ.— అయిందమ్మా! అయింది. ఏం పేరంట్రమోగాని పాడుపీడ?

కృష్ణ.— ఏమమ్మా కోప్పడుతారు? విశేష మేమి?

సుబ్బ.— విశేషానికేమి? ఎవరింట చూచినా అదేమియేడ్పో గాని మావంటి వైదీకులను చూస్తే యెగతాళి పరిహాసం. ఏందో మేమిచ్చిపెట్టుకొన్న దంతే. మీావలె మేము మహారాజులు కావలెనంటే అవుతామా? అదేం మిడిశిపాటుతన మమ్మా! అట్లాఒళ్లు తెలియక వస్తుంది? గడిచిబతికినవా ళ్లెవరూలేరు. మహారాజులముగాని బీదవాండ్రముగాని ఆకడుపే ఆమానమే.

కృష్ణ.— ఏం దమ్మా, సుబ్బలక్ష్మమ్మగారూ, అట్లా కోప్పడుతారూ? ఎవరేమన్నారో చెపితే కదా దేనికీ?

సుబ్బ.— అది కాదమ్మా! ఆ అరవవాళ్లపిల్ల, అభిరామి కూతురుండ్లా నాగు. అదేమి మిట్టిపడుతుందమ్మా ఇప్పుడేను. ఇంకా ప్రయోజనమేకాలేదు. మొగుని ముఖమెరుగదు. ఆ మొగునికేమో గొప్ప అములు.

దారుపని అయిందని కాళ్లు నేలపై నిలవడంలేదు. మిడిశిపడుతుంది. మొగునితో అ దేంకాపరంచేస్తుం దోగాని?

కృష్ణ.— పోనీండి, పిల్లది, ఊరోక్కండి. వాళ్లెవరో వస్తున్నారు. బాగుండదువింటే. ఇదిగో ఈసగడాలదండ. మీకో చీర ఉగ్గ్రాణంలో పెట్టియున్నాను, కట్టుకోండి పోం డి. జాగ్రతగా రండి - వచ్చినవారిని కూచోబెట్టి తాంబూలం అదీ యివ్వవలసి ఉంటుంది.

(సుబ్బమ్మ నిష్క్రమించును. సరస్వతియు నాగమ్మయు ప్రవేశింతురు.)

సరస్వతి.— ఏమమ్మా, ఇంకా యేమీ సద్దు లేకున్నది. వేళకా లేదా?

నాగమ్మ.— మీకు అవసరం ఎక్కడన్నా పిలిస్తే చాలు. ఇంకా అస్తమానానికి రెండుగడియలున్నవి. దీపాలుపెట్టిన వెనుకనే కదా అంతాను?

కృష్ణ.— రండి రండి - సరస్వతీభాయమ్మగారూ, నాగమ్మగా రూ రండి - కూచోండి.

సరస్వ.— ఏమమ్మో - మేమే ముందు వచ్చినట్లున్నదే? ఇంకా ఆలస్యమా?

కృష్ణ.— సలుగురూ రావలెగదా?

నాగ.— మాటే నేచెబితే, అప్పుడే తొందరపడి వేషించి పిలు చుకొని వచ్చింది.

కృష్ణ.— మూంమీద ఆమెకు అభిమానం.

సరస్వ.— ఎక్కడిది దమ్మా కొత్త అడ్డిగ కొన్నారా యేమి?

కృష్ణ.— ఔను. మొన్న.

నాగమ్మ.— ఎంతే? బాగున్నది.

కృష్ణ.— ఎనిమిది వేలు.

సరస్వ.— రంగమ్మ మెడలోనిది పన్నెండువేలట గాని యింతశా గుంల్లేదు.

నాగ.— సరేగాని. ఆడబిడ్డ ఊళ్లోలేదా?

కృష్ణ.— ఉన్నది. ఏం?

నాగ.— ఉంటే అడ్డి గెక్కడిది?

[నారాయణమ్మ కనకమ్మ ప్రవేశింతురు].

కృష్ణ.— రండిరండి. నేడు మీరందఱు రావడం ఒకటి- కనకమ్మ రావడము ఒకటి. మొగుడు వెళ్లమన్నాడటే నిన్న?

నారా.— మాయింటాయన్ను శిభారుసు చెయ్యమని మూడు ఝాములనుండి శతపోరితే యిప్పటికైంది. మఱి యింక ఒకగడియకల్లా పిలుచుకొని వస్తానని చెప్పి వచ్చినా.

కృష్ణ.— పిలుచుకువస్తానంటే నీవూ వెళ్లడమా?

నారా.— ఔను.

కృష్ణ.— సరే. సరే. ఇద్దరూ యిప్పుడే పొండి. మీ యిండ్లకు నేనొస్తే పొద్దస్తమానాలూ వుండవలె; మీరు వస్తే విభీషణా అంటూ అపుడే వెళ్లవలె?

సరస్వ.— సరే ఉన్నాండి. నీవు పంపితేనా, పంపకుంటేనా వారు వెళ్లడం?

[లక్ష్మమ్మ ప్రవేశించును.]

లక్ష్మమ్మ.— ఇదుగో నమ్మో నేనూ వచ్చినాను. అన్నీ అయిందేమో ననుకున్నాను. ఇంకా యేమీ అగుపళ్లేదే? అదేండె మకరం అట్లా కట్టించినారు రుక్మిణమ్మగారింట్లో పాన్పు ఎంత ముచ్చట ముద్దులు మూటగట్టు తున్నాంది.

నాగ.— దీనికి మాత్ర మేమి? వంకరా? వారింట్లో అన్నీ రంగులతోటే - యిక్కడ అంతా తెల్లగా ధావళ్యం నిగనిగ లాడుతున్నది.

నారా.— పొద్దవు తున్నదమ్మా!

కృష్ణ.— ఈవేళ గొబ్బిళ్లకు లక్ష్మమ్మ ఆరంభించవలెను.

లక్ష్మమ్మ.— నా కేమోనమ్మా - ఈవేళతలంటుకున్నాను, జలుబు చేసింది. నేను పాళ్లేను. నాగమ్మా, పాడవమ్మా.

నాగ.— మీరేమన్నా అనుకోండి. ఇదుగో నా కాళ్లూ చూడు. నావల్లకాదు. అదీకాక యింట్లో నాకు తొందర. బిడ్డయేడుస్తుంది.

నారా.— అయితే - ఏమే సరస - నీబిడ్డకు ఏమేమి నోములు చేయించావే. రావలె రావలె అనుకుంటాను - తీరదు.

లక్ష్మమ్మ.— నీవలె వుందా? నీయింటాయన వలెవుందా? ఏమే?

కృష్ణ. సరే అందరూ అలా అంటుంటే ఏలాగే .?

సరస్వ.— ఇదో కనకం, నీవు మానంవహించడం అంటే బా గుండ్లేదు. నీది మహాబింకాలే!

కనక.— ఒళ్లు నిమ్మళంగా లేదుగాని లేకుంటే యెన్నో పా టలుపాడుదును.

[సుబ్బలక్ష్మమ్మ ప్రవేశించును.]

సుబ్బ.— ఏందమ్మో, నూపాడు, నూపాడు అంటున్నారు. ముందు 'గౌరికల్యాణా' కానిండి-ఆవెనక సువ్విదంచ వలె. అవి వదలి అపుడే గొబ్బిళ్లా?

కృష్ణ.— నారాయణి - నూ కాని ప్రొద్దవుతుంది.

నారా.— మాయింటాయన యేమన్నా అనుకుంటారు.

కృష్ణ.— ఆయన్ను మేము పేరంట్రానికి పిలవ లేదులే. ఆయన రానూరాడు. కాని.

సరస్వతి.— వచ్చినా నేను చెబుతాకాని.

కృష్ణ.— ఇదిగో కనక. ఇంతేకదూ నీసహవాసం - సరే. పాడవే అంటే.

[నారాయణిపాడంగా అనుసరించుచు గొబ్బిళ్లు తట్టుదురు.]

కనక.— ఇక ప్రొద్దయింది. తాంబూల మివ్వండి వెళుతాం.

కృష్ణ.— ఏం. అప్పుడే యేంప్రొద్దయిందే? యింకొక్క పాట కానియ్యవే, జంభాలు.

నారా.— పాడవే పాడు. ఇద్దరం ఒకటిగా పోదాం.

కనక.— ఆంహాం ఆయన.

సరస్వ.— అదే మల్లాడిపోతావే మొగుడు మొగుడు అని?

మాకంతా మొగుళ్లు లేరా? కాపురంచెయ్యలేదా? పేరంట్రం కూడావద్దంటాడా? ఎప్పుడుచూచినా పక్కన్నే ఉండవలెకాబోలు?

నాగు.— పోనీలేవే. ఊరొక్క. కానియ్యవే, ఒకచే. అంతటితో అందరూ పోదాం.

[కనకమ్మ పాడఁగా నితరులును అనుసరింతురు.]

నారా.— ఇక చాలునమ్మ. పొద్దయింది. రేపొస్తానులే.

కృష్ణ.— ఏమి,సుబ్బలక్ష్మమ్మగారూ? వీళ్లకంతా పసుపు కుంకుమ పెట్టి తాంబూలా లియ్యండి.

సుబ్బ.— [అందటికిని తాంబూలములిచ్చును. ఎవరి దారిని వారు వెళ్లుదురు.]

కృష్ణ.— ఇక మనం లోపలికి వెళుదాంరండి.

[నిష్క్రమింతురు.]



## ద్వితీయాంకము — తృతీయరంగము.



స్థలము : మిరాశీదారునిల్లు.

సాతాని. ఔనండి. పల్లికె శింగారి స్తేదాండి అందం. పెళ్లికిదా తొట్టి శింగారిస్తిమే - ఇప్పుడు శామంతిపూలు శానాచిక్కుతాంది - మనం శెయ్యకుంటే యింకెవరు చెయ్యపోతారండి.

భార్య.— ఔను - మనయింట్లో యిది వరకు పల్లకి ఊరేగింపు చెయ్యలేదు. అది బాగుంది.

బ్రాహ్మ.— అన్నీ బాగున్నవి గాని నాకేమో ఊరేగింపు యిష్టంలేదు.

భార్య.— మీాకిప్పుడు మరీ రానురాను కాసుమీాద కాంక్షపుట్టింది. ఊరేగింపొద్దు - వేడుకలు ఒద్దు - అంటూ, చిన్నప్పుడు మీాకు మీాయక్క ఉగ్గుపెట్టిందంటారు. నిజమే. ఆవుగ్గులో బాగా ఆమె గుణాలన్నీ నూరిపెట్టింది కాబోలు.

సాతా.— ఊరేగింపు లేకుంటే అందాయితి లేదండి; సూడండి, మనవూళ్లో ఎంతచిన్నయింటివాళ్లుగాని అమ్మాయి బుద్ధి యెరిగిందంటే ఊరేగింపు చెయ్యనివారు లేరండి. మనయింట్లో చెయ్యకుంటే అదిశానా— నేను

చెప్పకూడదు. అమ్మగారి మనసుకు కొందుపకూడ దండి.

భార్య.— అమ్మాయికికూడా ఊరేగింపుకావలె నని యిష్టం వుంది. వచ్చినవాళ్లందఱు ఊరేగింపు చేస్తారా ఊరేగింపు చేస్తారా అని అడుగుతున్నారు. అదిలే కుంటే నాకు శానా అవమానంగా వున్నది.

బ్రాహ్మ.— సరేగాని. ఊరివాళ్లు వెయ్యిచెబుతారు. అవంతా మన కెందుకు? నాకు కాంక్ష అంటివే. ఆవూరేగింపు ఖర్చంతా యేదన్నా ఒకనగచేసి అమ్మాయికి పెట్టు. ఒక చీర తీశియ్యి; ఒద్దనను. పెండ్లిలో ఊరేగింపు అంటే అదేమో చిన్నప్పుడు గనుక సాంగ్యంకూడా ఉంది సరే—అయినా అది నాకు యిష్టంలేదు. పెండ్లి పెండ్లి అని బోలెడు ఖర్చు. అనావశ్యకపు దంతా చేసుకుంటు రావడం. అవి అంతా యేదన్నాలోకోప కారానికయినా ఉపయోగంగావలె. లేదా, మనం చక్కగా తిని అనుభవించవలె. పిల్ల సమర్తవూరే గింపు అంటే నాకేం బాగుండ్లేదు. అసలు ఈ మకరాలు గికరాలే నా కిష్టంలేదు. అమ్మాయికి మనసుకు కొందవకూడదనీ, ఆడవాళ్ల ప్రమేయమే గదా - ఇంట్లోనేగదా అని ఒప్పుకొంటిని.

సాతా.— ఏమండి మీరు? ఇప్పుడిప్పుడు కొత్తగామాటాడ్తారు. ఒకే ఆచ్చెర్యంగా ఉండాది. ఇవంతావేడుకలండీ. వేడుక లేకుంటే ఏముండాదండీ. లోకంలో, మేళ

గాడనీ, దాసనంబీ లని, సంగీతా లని, భోగంవాళ్లని
అంతా ఆదేవుడు ఎందుకుపుట్టించినా డండి. ఆయా
వృత్తులు జరగవలె నండి. మీరు వెనుకతీయకండి.
మనయింట్లో గిరాకివిని, నేను శ్రీరంగంనుండి పెద్దపెద్ద
గిరాకిలనంతా వుడిచేసి వస్తినండి మనయింటికి
మించిందా? అమ్మగారికి, అమ్మాయికి మాకందఱికి
మనసుకు కొదవకూడదండి.

భార్య.— మీ రేమిచెప్పినా వింటానుగాని, ఊరేగింపువద్దంటే
నేను విననను, ఆడవాళ్లంతా అడిగిపోతారు. లేకలేక
ఒకపిల్లకు వేడుకలుచెయ్యవలెనంటే ఇన్నికడగంట్లు.
మీయిష్టం మీ రేమన్నా చేసుకోండి. నాకక్కర
లేదు; నేపోతాను. (అని కంట తడిపెట్టుకొనును.)

సతా.— అమ్మా కణ్ణీళ్లు పెట్టకండి. అయ్యవారు యిట్టదా
మొదట చేప్పేది. మీయిష్టానికి విరోధంచెయ్యరు.
ఇదంతా చెప్పితేదా నేను కొంచెంఅడుగుతు నని.

భార్య.— మీఅయ్యగారుకద్దు. నూకద్దు. ఎట్లన్నా పోండి
నేపోతా.

[పోవును.]

బ్రాహ్మ.— (నిట్టూర్పు) హుం. సరి సరి రా. నీయిష్ట ప్రకారమే
కానీ. ఏడవకు. ఎవరన్నా చూస్తే నవ్విపోతారు.
(అని పిలుచుకొనివచ్చును.) ఏమోయ్ తిరువేంగ
డత్తానయ్యా – పల్లకి కెంతవును?

భార్య.— పల్లకి వొద్దు. గిల్లకివొద్దు. ఆడబిడ్డ అనేట్టు నావల్ల మీా కింతఖర్చెందుకు? నే వచ్చినప్పటినుండి మీాకు అన్నివిధాలా ఖర్చులే. నేను పెద్దమ్మను. మీాయింటిని తుడిచి వూడ్చేదానికి వొస్తిని.

బ్రాహ్మ.— అవన్నీపోని. ఏడవకు. ఊర్కో నీ కెట్లా కావలెనో అది చెప్పు; ఆడబిడ్డ చెప్పనీ యెవరు చెప్పనీ.

సాతా.— మరి. మొత్తంపల్లకికి రెండువేలండి.

బ్రాహ్మ.— రెండువేలు!

సాతా.— అవునండి. అంతాముత్యాలపని, పూలపని, గెండర్యాలు. కొత్త కొత్తమాదిరీలంతా మా వెట్టివేంగడం అయ్యవారు చెప్పతారు, అట్టా శింగారిస్తామండి.

బ్రాహ్మ.— సరి. విధిలేదు కాని.

భార్య.— విధి లేదు, గిధి లేదు అని విసుక్కుంటూ నాగ్గాను మీారు చెయ్యవొద్దు.

బ్రాహ్మ.— ఇక నీవు వూరుకో — సరి, కానీవయ్యా.

సాతా.— తాంబూలం. అచ్చారం.

నౌకరు.— [ప్రవేశించి] స్వామీా, నందుడు, వచ్చి యున్నారు. ఏమో చూడవలెనట. చాలాసేపటినుండి తొందర చేస్తున్నాడు.

బ్రాహ్మ.— వెధవ యెన్నిమాట్లు చెప్పినా విడువడు. సరి, రమ్మను.

[సాతానితో] ఇక నీవు పోవయ్యా. సాయంత్రం వచ్చి గుమాస్తావద్ద తీసుకోవయ్యా.

[సాతాని నిష్క్రమించును. నందుఁడు ప్రవేశించును.]

నందు.— స్వామీ,

ఉ॥ కోవిదులన్ మహీసురులఁ గూరిమి దాసులఁ గాచువారలన్
దేవతల న్నియు న్గడిసి దేశికు లంచును చేరినాఁడ నే
సేవగ నైన నాపగయ దింకఁగ మాలని పుట్టు వీడ నేఁ
బోవఁ జిదంబరంబునకుఁ బూనికఁ బుట్టిన యాస దీర్పఁడీ॥

ఆతిల్లయాంబలం బను చిదంబరమున కేగి ఆనటన సభేశుని దర్శించుటకు నామన మతికుతూహలం బునఁ దహతహపడుచున్నది. ప్రభూ, ఏలాగున నైనఁ జూచిరాను నాకు సెలవొసంగవలయు. స్వామీ, ఇందులకు నే నెంతయు కృతజ్ఞుఁడను.

బ్రాహ్మ.— నందా! ఏమంటివి?

రాగము : ముఖారి - తాళము : ఆది.

చిదంబరదర్శనమా - నీ పది - మది నెంచఁ దగునా ।పల్లవి। చిదం॥

చిదంబరదర్శన - మది బాపల కగుఁ

గడియ రానికులజుఁడవౌ - చండాలున కగునా।

అనఁబోకుమ యిఁక - నిలఁబోకుమ యిటు।

గడిసెను జేరన్ - దడయక పోరా॥ చిదంబర॥

సనకసనందన - మునివరు లరసిన

కనకసభేశునిఁ - గనుగొనఁ దరమా

చనఁగునా - యట - కనఁదగునా యది

చనిన ల్లయ్యతోఁ - గొనియాడుమురా ॥ చిదంబర॥

నీకు చిదంబరదర్శనమా? నక్కయెక్కడ? నాక లోకమెక్కడ? అందనిమ్రానిపండ్లకర్రులు చాచెదవా? వెధవా! మాలవానికి చిదంబరమును మోక్షమును! ఎవరు చెప్పిరిరా నీకీ తెలివి. నీవు పూజింప తగినదేవుళ్లు వేరు. కుదురుగా పనికిపో.

నం.— నన్ను మన్నింపవలయును. ఆచిదంబరమును, జన్మములోపల నొకతడవయైన దర్శించినవానిపాపము లెల్లఁదొలఁగునఁట. మఱి వేఱుజన్మమె లేదని పెద్దలు చెప్పఁగా వినినాఁడను. కాన స్వామీ, నా కొక్కమా రాతిల్లయంబలమును జూడఁబో నాజ్ఞ యొసఁగ రాదా? నే తమదాసుఁడఁ గానా? ననుఁ గడతేర్చు పుణ్యము తమకు రాదా? నాపైఁ దమ కింత కరుణ రాదా?

బ్రాహ్మ—.

రాగము - కానడా.

బుద్ధిచెప్పి న న్వినవుగ మూఢా గాడా నీ
విద్దెల నే నెఱుఁగుదు నిఁక పోరా పోరా॥
ము క్తియు మఱి భ క్తియు మీ మాలలకేలా
స క్తము లాదైవంబులు మా బాపలకే॥
హ స్తము మీఱినఁ దెగలోఁ బాపం బౌగా।
అద్దిర నీయీచేఁతలు మీవాడక వాడక
శ్రద్ధయు ను న్నతునివగ నీ విట వచ్చి
సుద్దుల నాడకు నిల్వకు ఛీ ఛీ పోరా॥

ఎంతబుద్ధి చెప్పినను తెలియని మూఢా, నీపోకల నే నెఱుఁగుదును. భక్తియనియు ముక్తియనియు నడుగడుగునకు బల్కెదవే. ఆభక్తియును ముక్తియును మాలల కేదిరా? అది బ్రాహ్మణులకృత్యము కాదటరా? ఊరక ప్రేలక పొమ్ము.

నందు.— స్వామీ, ఉత్తమకులజు లగు మీరు మరల మరల ని ట్లనఁ దగునా ? అఖిలాండకోటిబ్రహ్మాండనాయకుండును, నిత్యానంద స్వరూపుఁడును సృష్టిస్థితిలయ కారణభూతుండును నగు నాపరమేశ్వరునకు మాలవేఱు, మంగలి వేఱు, బ్రాహ్మణులు వేఱునా? తలిదండ్రులకు బిడ్డలయెడఁ బక్షపాతమా? ఈమాలతనమును, మంగలితనమును, ఈబ్రాహ్మణత్వమును జన్మ మెత్తిన యనంతరము మనముగాఁ జెప్పుకొనిన వ్యవస్థయే యనుట తమకుఁ దెలియనిదా? మాలని దేహనిర్మాణ పంచభూతంబులకు బ్రాహ్మణదేహనిర్మాణ పంచభూతంబులు వేఱా? ఇంద్రియవ్యాపారాదులు వేఱా? ఇవన్నియు తామెఱుఁగనివా? స్వామీ, ఆపరమేశ్వరుఁడందఱి యెడలను సమానప్రవృత్తి గల్గినవాఁడు. ఏదో పూర్వజన్మపుఁ బాపశేషమున నీనీచజన్మ మలవడెను గాని ఆత్మ యొక్కటియేగదా? ఆపరమాత్మ యొక్క పరమాణుస్వరూపమేగదా మన మందఱమును. ఇట్లుండ తా మేల నాపై గికినుక వహించెదరు? ఒకరి

నౌకరు దూషించిన నది పరమాత్మను దూషించి నట్లేగదా?

బ్రాహ్మ.— ఆఁహాఁ! నామాటల కెదురాడెదవా, మూర్ఖా? ఇంతటిగర్వమా? ఇక నిమిషమాత్రమున నీకు పట్టియుండు నాచిదంబిర భూతమును వదలించెదచూడు పలవా? నాకు నీతులుపదేశించెదవా? నాయెదుటనిలిచిన చూడు, నిన్నిప్పుడె బండకొయ్యవేయింతును; పొమ్ము. ఈపిచ్చి నీ కేల? ఇక నామాటల మఱువుము. పొమ్ము. పొమ్ము.

నందా.— స్వామీ,

ఉ. పిచ్చి కుదుర్చు మందొకటి పేరిమి నున్నది తిల్వకాననలో
నచ్చటి కేగి శీలమున నంబను నేవసభేశుతాండవం
బొచ్చెము లేనిచిత్తమున నుల్లము రంజిల సేవఁజేయఁగాఁ
బిచ్చి తొలంగు మున్న నటుపిమ్మట జీవికి ముక్తికల్గుఁగా.

రాగము - నౌరోజ్. తాళము- రూపకము.

పిచ్చి కుదుర్పను కందు నింపునందు సచ్చిదానందమందు,
అచ్చవచ్చునే - వేఱే మందైన, నా - యొడలనొంట దనియెదనయ్యా.
నాగము వేఁగియుఁ బాటుపడి యరసి పైరుచేసినట్టిది,
నేమముతో నలువ వామనులుగని యానందమొందినది,
నగజయు నీసరికే యం దర్ధమాని యాని యున్నది.
ఆగకనీవిఁక మతియర్థముసేవించి-రారా-పోరా-పోరాయనవమ్యా.

తమదాసుల కేదైనరోగము గలిగిన దానిని తాము కుదుర్చ నెంచవలదా? కనుక న న్నచటికిఁ బంపిన

నాకున్నయాపిచ్చిని కుదుర్చుకొని మరల తమ సేవకై వచ్చెదను. ఇంతమాత్రము, నాయందు కనికరముంచి. వరమును దయచేయుఁడు. మీకిదే వేయిదండములు.

[నమస్కరించును.]

బ్రాహ్మ.— [ఆత్మగతము] మంచిది. వీనిని బెదరించి చూచిన నుప యోగ మున్నట్లు అగుపడదు. సామవాక్యంబులఁ జెప్పి చూచెద. [ప్రకాశము] నందా ! నీవు పరమ సాధువు, నాయొద్దమహావిధేయత గలవాడవు. అందఱికన్న నెక్కువపనులు చక్కగా చేయువాడవు. నీయందు నాకు అమితాభిమానము. అట్లుండ నీవిట్లు ముందు వెనుక లాలోచింపక, భోగాముల నెఱుగక చిదంబర మేగవలెననెదవే. అది తగునా? పెద్దలు చెప్పినట్లు వినవలదా ?

చ. కదురుచు కంకి మూరెడగు కట్టకుఁ దూమెడు ధాన్య మౌనుగా
ముదమున నీదుహస్త మటు ముట్టిన మాత్రన పంట బంగరౌ
గద యని పల్కుచుందుదువు గర్వపు మాటల మాలవాడ నీ
వదివిడనాడి నేఁ డలచిదంబర మేగెదొ వింటిమీగెదో !

నందా, వల దుడుగు మా ప్రయత్నమును.

నందు.— స్వామి, ఈనీచజన్మము పోయి మరలజన్మము లెత్తుచు చచ్చుచు చీకటియం దుండవలసిన ప్రమేయము లేక, సదా యీశ్వరసాన్నిధ్యమునందే యుండఁ దగిన మార్గముగదా నేఁ గోరినది ? నాయందు దయయుంచి నన్నేతీరున నైన పోనాజ్ఞాపింపుఁడు.

బ్రాహ్మ.—

చ. వలువదిగుంట లింకయును నారలు నాటవలె న్నమ చేమిరా
విలయముగాను బుట్టె నొకవింత చిదంబర మేగుపిచ్చి నీ
వలనను బాగుగాదుగద వాయుదు నన్ను మనంబురాదు నీ
వలవికి మించినాఁడ వహహా యిఁక వాడఁ దలంగి పోవరా.

పోనిమ్మని ఎంతచెప్పినను వినకున్నావు. ఇవి యంత యు నీవుగాక నీయబ్బ చేయు నని యెంచితివా? పొమ్ము. ఎదుట నిలువకు, వెధవా. నీతో నేను మాటలాడలేను. పోపో. నిన్ను ఎచ్చటికిని పోనీయను.

[బ్రాహ్మణుఁడు నిష్క్రమించును.]

నంద.— రాగము - మోహన : తాళము - త్రిశ్రఏకము.

చిలుక బూరుగు చంద మాయెనె - నాపలుకులెల్ల వట్టి వాయెనె।
మాలవాడయె మోక్షమాయెనె - తిల్లయంబలి మనుటయె పోయెనె॥
విడవటికై చల్లు టాయెనె - నా వేడికోలు నుత్తదాయెనె॥

నా యెన్నివిధంబుల వేడి కోలులును అడవిఁ గాచిన వెన్నెల యాయెఁగా? హాఁ దైవమా! నాకీమాల వాడయే మోక్షమాయెనా? చిదంబరము కలవా యెనా? స్వామీ! నటరాజమూర్తీ! నను నీదఱిఁ జేర్చికాపాడవా! ఇంక నెన్నాళ్ళిట్టి యంధకూపంబున నుండ నియమించితివో గదా! ఏమి చేయుదు! మరల వేడుకొండ మన్నను అయ్యవారు లోనికి వెళ్లిరి. సరి యిఁక నాకు ప్రాప్తికాలము రాలేదు గాబోలు. దైవమును నమ్మి చెడినవారు లేరుగదా? ఆదైవం బెటు లేకపోవునో చూచెద. వాడ కేగెద.



నిష్క్రమించును.

## ద్వితీయాంకము - చతుర్థరంగము.



స్థలము : మాలవాడ.

సందు.— [చింతామగ్నుఁడై ప్రవేశించి.]

రాగము : జంఝూటి. తాళము - ఆది.

చిదంబర మేగక యుండునా - నా -
జాతము వ్యర్థము సేయుదునా॥ నే చిదంబర॥
భక్తియు మదియుఁ బొందిన దచట
సత్యంబుగ నాబొందియె యిచట॥ చి॥
ఆశయు నానంద మందుట యచట
క్లేశముపాశము పూనుట యిచట॥ చి॥

తుదకు నాగతి యిటులాయెగా, నే నెన్నివిధములఁ దెలిపి వేడికొన్నను, అందొక్కటియు నాతనిమనసు కరిగింపదాయె. నేనేమిచేయుదు? చేయఁగలుగుదు? ఆమహానుభావుని పూజింపని యీచేతులును, ఆదేవుని కొనియాడని యీనాలుకయు, భూలోక కైలాసంబగు నాచిదంబరమునకుఁ బోవని కాళ్లును, ఆలోకనాథుని దర్శింపని యీకన్నులును, ఆకనక సభేశుని గుణానుకీర్తనంబుల వినని యీచెవులును, ఆతిల్లయంబలుని మ్రొక్కని యీశిరమును, ఉండి యేమిప్రయోజనము? అయ్యో, నాగ్రహచారము నే మందును! ఈపాపపుశరీరంబుతో నేనింక నెన్ని దినంబు లుందును. ఈఘోరకృత్యంబులఁ జేయు చునింక నెంతకాలమిందు మందును? మునివరులును

దేవతలు నెవరి మూలమున తరించిరో, ఆపరమే
శ్వరుఁడు ఆనటనసభేశుఁడు, ఆశివకామసుందరి
నాయకుఁడు, ఆచిదంబరేశుఁడు, ఆకరుణాసము
ద్రుఁడు, ఆవరదాయకుఁడు, ఆనిత్యానందమూర్తి,
నాపై ననుగ్రహించి నన్నొక్కదరిఁ జేర్చ, ఈబ్రాహ్మ
ణునిమనసు నెప్పుడు కఱుఁగఁ జేయునో గదా?
దైవమా, నిన్ను చూడఁజాల, చూడకుండఁజాల.

ఉ॥ ఎన్నఁడు తిల్లయంబలము నెన్నఁడు గోపురమండపంబులన్
ఎన్నఁడు తాండవేశ్వరుని నెన్నఁడు నే శివకామసుందరిన్
ఎన్నఁడు చూడఁ గల్గుదునొ యెన్నఁడు నేతరియింప నేర్తునో? -
అన్నియు నెన్నఁ డౌనొ మఱి యన్నటనేశునను గ్రహంబునన్॥

నన్నెట్లు అనుగ్రహించి కాపాడుదువో, ఈజరాభా
రము నాకు లేకచేయుదువో? (దృష్టిసారించి) ఏల
నే నిట్లు చింతించుట? శివునాజ్ఞలేక చీమయు కుట్ట
దందురు. కనుక నే నతనిని దర్శించు కాలము
సమీపింపలేదు కాఁబోలు? కనుక నే మాయయ్య
వారికి మనసుకరుగలేదు. రేపుదయమున నాయ
జమానుని మరల పోయి వేడికొందును. ఆర్ద్రోత్సవ
మని జనులందఱును వెళ్లుచున్నారు. మహావిశేష
మఁట. అదిజూచిన నెప్పుడు నీశ్వరనిసన్నిధియందుం
దురఁట, పోయెద. నేఁడు నేనాచరింపవలసిన కృత్యము
లఁ జేసి రేపేబయలు దేరుటకు సంసిద్ధుఁ డనయ్యెద.
నిష్క్రమించును.

---

## ద్వితీయాంకము - పంచమరంగము.



స్థలము : బ్రాహ్మణునియిల్లు.

బ్రాహ్మణుఁడు, కృష్ణమ్మ, అక్కరంగమ్మ, శేషయ్య ప్రవేశము.

బ్రాహ్మ.— ఇందులకే మంటావు ?

రంగమ్మ.— ఎందుకే మనేది? వాఁడు పోయిందే పోకలా? ఎంత్ర మాత్రము సరిపడదు.

శేషయ్య.— మీరు చెప్పేది నిజమైనమాట.

కృష్ణమ్మ.— మనపిల్ల క్షేమం మనం చూడవలెనా వద్దా?

శేష.— ఆఁ అడిగో ఆయోచన చేయండి. నూఱుసంవత్సరములపైరు. మన అమ్మాయి ఆగర్భశ్రీమంతురాలై అన్నీ రాజసుఖాలు అనుభవించి అక్కడ కష్టపడే విషయం యోచించవలె. అల్లుణ్ణి సుఖపెడితే కూతురు సుఖపడగలదు.

బ్రాహ్మ.— అయినాగాని, మీరు చెప్పేమొత్తం యెక్కువ. ఇప్పటికే అమ్మాయికి నగలకు 25 వేలైంది. తూగుమంచం, వెండి మొఖమలుపఱుపు, ఒకటికి రెండు వరుసల సామానులు. వెండి సామానుల వరుస ఒకటి. బొమ్మసామానులు వగైరాలు, చీరలు, రవికలు అంతాకలిసి అయిదారువేలకు పైనే అయింది.

శేష.— ఇంతైనప్పుడు వా రట్లడిగేది బాగుండ్లేదు. అంతా

వారికే గదా చేరుతుంది. ఈయడిగేది న్యాయం గాదు.

రంగ.— ఏమి? అంతా ముప్పైవేలైందా? బాగుంది బాగుంది. ఆలుమొగుడు గుసగుస లాడుకొని, ఏమీ లేదు ఏమీ లేదు అని ముప్పైవేలైందా? బాగైంది కాపురం? ఎవరుచెప్పిరిరా యీ తెలివి?

బ్రాహ్మ.— అక్క, వూరుకో, నే వెనుక చెబుతాను.

కృష్ణ.— గుసగుసలాడి నే నేమిఃసొమ్ములు చేసికోలేదు. నాపుట్టింటికి పంపలేదు. మనయింట్లో పుట్టినపిల్లకే. అదే గనక మొగవాడై వుంటే?

రంగ.— సరి, యేమైనగాని. అట్లయితే యిప్పటివరకు ఇచ్చింది చాలును. పెండ్లప్పుడు పెదతామన్న సొమ్ము పెట్టకనే పోయిరి. నడచుమర్యాదలు మరీ అధ్వాన్నం. మాయింట్లో వీధివూడ్చేదానికి మేమిచ్చినంత చీర కూడాలేదు. పెండ్లిలో వంటవాని కిస్తాము మేము ముప్పైనలభైలదోవతి. ఇంతగొప్పవాడు పెద్దమిరాశిదారునింటి పిల్లనుచేసుకొని గృహప్రవేశానికి ఆలుమగడు శుభంగావస్తే పట్టుమని తుదకు నూరు వరహాల చీరదోవతులు కూడాలేదు. వారిభవిష్యనూర. 10 వేలట, 20 వేలట! బేరం చేస్తారు, సిగ్గులేక. చాలుచాలు. లేచిపోవయ్యా, పో, మహా సుధ్యస్థం చేయువచ్చినావు!

కృష్ణ.— వారుచేశిందానికి యీాయనమీాద కోపపడితే నె

ట్లా? వారినారి శక్త్యనుసారం వారిస్తారు. దాని కంతా మన మాక్షేపిస్తే బాగుండదు.

శేష.— ఈపూర్వోక్తులు నాకు తెలియవు. మీరుకోపపడకండి. కొంచె మోర్చుకోండి. ఇప్పటికే వారింటిమీద నలుగు రాడుబిడ్డలు చెడిచేరినారు. తండ్రి లేడు, తల్లి వెఱ్ఱిబాగులది. ఐవు తప్పివచ్చినవారిని నలుగురిని పోషించవలసిన భారం వీడిదాయెను. ఆవెనక చదువుకావలె. సంసారం కావలె. వచ్చేపిల్లకు తగినట్టు వారక్కడసగపరా చేసుకుంటే గదా ?

రంగ.— సరే- నలుగురు ఆడుబిడ్డలా? బాగుంది. ఆముండలకంతా మాయింటి డబ్బేకావలెనా? బుద్ధిబాగున్నది. మాపిల్ల కాపురం చేయకుంటే మానిందిగాని ఒక్కరాగి దమ్మిడి యయినా యియ్యాము. మాపిల్ల మాయింటనే ఉండనీ. చెట్టుకు కాయ బరువు లేదు లే.

బాగ్రిష్మా.— అక్కా, నీమాట బాగుండ్లేదు. పెద్దది చెప్పతగిన మాటగాదు. ఆడవాళ్లు మొగునితో కాపురం చేయతగినవాళ్లు. నీమరద లన్నట్లు రేపు కాపురంచేస్తూ కష్టపడేటప్పుడు మీరిట్లాచేస్తిరో. నాకాపురం కూలిస్తిరో అని అనుకోకుండా వుండేదారి చూడవలె చూడు.

కృష్ణ.— అదేమి రంధోగాని నాఅదృష్టంవలెనే ఉండవలెనా దానికిని ?

రంగ.— నీకేమైందే. ఇంకా ఇంతకన్నా కనాకష్టంగా వుండ వలశిందానవు. మాఅమ్మపుణ్యాం కట్టుకున్నది.

కృష్ణ.— ఇంతకన్నా కనాకష్టం యెవరికీరాదు. అంతమట్టుకు ఆయన న్యాయం చూచి నడిచేందువల్ల యీలోకం లో ఉండవలిశివుందిగాని లేకుంటే యేదన్నా నూ యోగోయో ఒకటిచూచుకోవల్శిందే.

బ్రాహ్మ.— అక్కా, యెన్నిమారులు చెప్పినా నీవు ఊరుకోవు. లేనిపోనివ్యవహారం పెట్టుకొని చీటికి మాటికి తగ వులా? ఎక్కడ చూచినా, ఆడుబిడ్డపోరు ఆడుబిడ్డ పోరు అని అవమానంగా. ఆయ నేమనుకుంటాడు. ఆయన పనియేమో అది యోచింతాం చెప్పు.

శేష.— అమ్మా, పెద్దదానవు, నీకు తెలియనిదిలేదు. కోప పడకు, అన్నట్లు. మనపిల్లక్షేమం అల్లునిచేతిలో వుంది. ఆడుబిడ్డ పుడితే ఒకరిచేత పెట్టవలశిందే గదా? ఇంట్లో వుంటే నలుగురు అవమానంగా అనుకుంటారు.

రంగ.— సరి. నీవు ఒకడవు లేవుగదా అనుకున్నాను. నీవూ దాన్ని చేరినావు. ఏమ్మందు రాచిందో? ఆడుబిడ్డల పోరూ! సరే, యికమీద ఆడుబిడ్డలపోరు లేకుండు రులే. ఏపీడ ఎట్లాపోతే నాకేమి?

[అని చివాలున వెళ్లును.]

కృష్ణ.— అందువల్లనే నేను మీయిష్టప్రకారం చేయండి అనడం. ఆమెను పిలిస్తే యేదో ఒకతగువేకాని.

బ్రాహ్మ.— ఏమండీ. ఇదిగో ఈవిషయంలో నాకేం తోచలేదు. మీరెట్లా చెపితే అట్లా చేస్తానండి.

కృష్ణ.— అంతా ఆయన చేతుల్లో ఉంది.

శేష.— [ఆలోచించి] మీకిష్టమైతే నాఆలోచన వినండి. మీఅక్కగారు చెప్పేది సరికాదు. పిల్లవాడంత మొత్త మడిగేదీ సరికాదు. ఈవిషయంలో ఆపిల్లవాడు మేనమామ సలహా వింటుంటాడు. ఆయనకు కొంచెం పైకం కసాలాకనుక ఆయనచేతికి మొదన్నా ఒకటో రెండో తగిలిస్తే అన్నీ కుదురుతుంది.

బ్రాహ్మ.— అది నాకిష్టం లేదు. ఆయన అసాధ్యుడు. చేతికి వచ్చేవఱకు ఒకవిధం- ఆవల యింకోవిధం.

శేష.— నామీద మీకు నమ్మకం ఉంటే అది చెయ్యండి. ఆయనయేమైనా అట్లు విరోధిస్తే నన్నేమనిఅడగండి.

కృష్ణ.— అది బాగుంది. అట్లాచేతురు?

బ్రాహ్మ.— అప్పుడు ఆడుబిడ్డలు ఊరుకుంటారా?

శేష.— వారందఱును మేనమామ యెట్లుచెప్పిన అట్లు. మీరు యోచింపవద్దు. ఈయోచన చేయండి.

బ్రాహ్మ.— (యోచించి) సరే గానిండి. ఈసల్కాన్యాయ మేమో నాకెంతమాత్రము నచ్చలేదు. అట్లు వారికేమైన సహాయము గావలసియుండిన ఏదేని సహాయ మప్పుడప్పుడు చేయుచుండెదను. అతనికి విద్యాభివృద్ధికిగావలసింత ద్రవ్యసహాయము చేసెదను. కాని ఇట్లు నిర్బంధించిన నెట్లు?

శేష.— సరే గానిండి. మీ రనునది చక్కగానే యున్నది. అయినను మనపిల్లసుఖమును చూడవలసినది మన కు ముఖ్యము గదా ?

బ్రాహ్మ.— అట్లని మీరేమి యీకన్యాశుల్కవరశుల్కము లను ఆదరింప వలయు ననెదరా ? ఇందువల్ల లోక మున నెందఱికి కష్టమో అది యోచన చేయండి. ఈదుస్మార్గములు నిలిచిననే గాని మనము వృద్ధికి రా నేరము. ద్రవ్యవంతులేదో యొకవిధముగ చేయుదు రను కొందము. బీదలగతి యేమి కావలెను? ఎట్లయి నను పైకమిచ్చి తీరవలెనా? అల్లుండ్రు మూర్ఖము చేయడం. ఇచ్చుటకు శక్తి లేక వీరు వల్లకా దనడం. ఈయిరువురిమధ్యను ఆడుపిల్లలు కష్టపడడం - తు దకు ఏదో ఒకవిధముగ అన్యాయ మరణమునకు లోబడడం. మనసంఘమున కెక్కడ నున్నదండి యభివృద్ధి ?

శేష.— మీరు చెప్పే న్యాయములన్నీ యొప్పుకోన తగినవే నండి. కాదనను. అయినా మనపిల్లక్షేమం మనం చూడవలెనా వద్దా ?

బ్రాహ్మ.— అట్లయిన నే నీవిషయం ఆలోచించి చెప్పుతాను. మీ రెక్కడికీ పోకండి. మనయింట్లోనే నిలువండి.

శేష.— ఆహా, అట్లే.

[నిష్క్రమించును.]

[బ్రాహ్మణుఁడు ఆలోచనామగ్నుఁడై యుండును.]

నౌకరు.— [ప్రవేశించి] స్వామీ, నందుడు వచ్చియున్నాడు.

బ్రాహ్మ.— ఏడీ రమ్మను.

[నందుఁడు ప్రవేశించును.]

బ్రాహ్మ— ఏమిరా నందా! ఉదయాస్తమయములు నీపోరు పెద్దదైనది. మరల నేల వచ్చితి విందు? ఉదయముననే యేల పనికి పోలేదు? మరల నీకేమైన చిదంబరపు పిచ్చి పట్టినదా. వదలించెదను.

నందా.— స్వామీ,

రాగము: బ్యాగ్. తాళము: ఆది.

ఆరుద్రోత్సవ - యభిషేకంబులు - రానున్నవి యయ్యా
అరటపెట్టక - యూరట కొకపరి - పోయి రమ్మనవయ్యా ||
నేల నడుగులిడ నేర్చినదాదిగ - మిమ్మె కొల్చితినయ్యా
కాలపాశబద్ధునిఁగాకను - కాపాడుండయ్యా ||
శేయుంబవలు మీరక్షణమున నే - రాజిల్లితినయ్యా
పోయిగాను సద్గతిఁ జెందరయని - పోయిరమ్మనరయ్యా ||
మేనున్నపుడే చిదంబర మొకపరి - కనిరావలెనయ్యా
హీనుఁడ న్యూనమన మాసించెను - పదములఁ బడుదునయ్యా ||
దిక్కెఱుంగని దీనుండను నే - దీవించుండయ్యా
దక్కించుఁడు గర్భం బంధునికిని - దిక్కుఁ జూపరయ్యా ||

చిదంబరమున ఆరుద్రోత్సవము జరుగఁబోవు చున్నది. ఒక్కతూరి పోయివచ్చుట కనుమతి నీయవలయు నని వేడుకొందును స్వామీ. నేను

తల్లిగర్భమున పుట్టినదాదిగాఁ దమయొద్దనే బానిస నైయుండి యేయపరాధమును చేయక వినయవిధేయములతోఁ బనులఁ జేయుచుండినది తమకుఁ దెలిసినదే గదా. అట్టి నన్ను దయయుంచి చిదంబరమునకేగిరా ననుగ్రహించి యీయముని బాఱినుండి కాపాడ వేఁడుదు. మహాప్రభూ - యీపాటి యనుగ్రహింపవలయును; మీకుఁ గోటినమస్కారములు.

రాగము : ముఖారి. తాళము: ఆది.

బ్రాహ్మ.—
ఆవుదినెడి యధమా నీకు నారుద్రోత్సవమా
ఆవేషం బెచ్చటనేర్చితో యవల తొలఁగిపోరా
పందిదినెడి పలవా నీకు నందిసేవయటరా
అందఱు నగుదురు చందం బెఱిఁగిన సందడిలేకపోరా
పిల్లికి పెండ్లియును మఱి నత్తకు నాగవల్లి
చెల్లాటం బిఁక నాడకుపోరా. కల్లగాఁడ, మూఢా.

గొడ్డుగోదల కోసి తినెడివానికి ఆరుద్రోత్సవమా? నీచా, ఇక నామాటయనక యెదుట నిలువక పో. చిదంబర మట ఈశు డట. నీకు ఈశ్వరుడు దర్శనమిచ్చుటకు అంత కాచుకొనియున్నాడా, ఇంతకన్న భక్తులులే రని? చాలు నిక నీవంచకపు మాటలు. ఎవరైన వినిన నవ్విపోదురుగాని. కుదురుగా నా చిదంబర మనెడి మాటల మఱచిపో పొమ్ము. మఱి యొకమారు ఆమాటందువేని నాలుక గోయింతును పొమ్ము.

నందు.— స్వామి, తమవిధేయుఁడను. తామేమి చేయుమన్నను సరే. ఏమి చేసినను సరే. నామస్సున నాటియుండు నాపరమేశ్వరుని చింతనంబు విడువదు. చిదంబరద ర్శన కుతూహాలమును పాయదు. పాయదు. పాయ నే పాయదు, స్వామీ.

బ్రాహ్మ.— మూర్ఖా, నీవెన్నిమాయమాట లాడినను నేను నమ్ము దు ననుకొంటివా? ఎంతచక్కెరపాలు పోసి పెంచిన ను పామునకు విషమును వేమునకుచేదును పోవునా? అట్లే నీవెంతయీశ్వరుని చూడవలెనని మాయవి ద్యల చేసినను నీకీజన్మము వదలుటయు, అతనిదర్శ నము లభించుటయును లేదు. వృథాప్రయాసవలదు. నన్నికతొందర పెట్టకు, పొమ్ము.

నందు.— స్వామీ, తా మెంతచెప్పినను నేవిన్నవించుకొను నదంతెయుఁ జిదంబరమునకుఁ బోననుమతికోరుటయే గదా. ఇతరవిధముల నే నేమిమాయఁ జేసితి. నా యందు గనికరించి మన్నించి మానతిండు.

బ్రాహ్మ.— ఓరిమూఢా! ఎన్నిచెప్పినను నీ వింకను నీమూర్ఖ ము మానవుగా? ఎవరియొద్దరా నీ వక్కఱవిన యములు? ఇట్లు పండ్లిగిలించిన ఏమఱి నిన్నూరక పోనిత్తు ననుకొంటివా? చిదంబరం చిదంబరమ్మని కూయుదువే? దాని యర్థమేమైన చక్కఁగా తెలి సినదా నీకు?

శాండు.— సర్వము తెలిసినతమ కింక నే నేమిచెప్పఁగలను? అగ్రవర్ణమున బుట్టినతా మట్లనుట యుచితముగాదు. ఇది దైవములేదను నాస్తికులు చేయవలసిన వాదముగాదా ? స్వామీ, ఈయొక్కమాఱుమాత్రమునన్ను కనికరించి రక్షింపవలయును, ప్రభూ.

బ్రౌస్టు.— నీ వెన్ని చెప్పినను వినక నాకతికష్టము తెచ్చిపెట్టెదవు. మంచిది. నీవన్నట్లు నీ కంతభక్తియుండిననీ కయ్యయంతయు చక్కగా పండి కోతకు సిద్ధమైన తర్వాత ని న్నంపెదను. అంతవఱకు నాయొద్దకు రాకుము పో.

[లోనికి వెళ్లును.

శాండు. — చిత్తము. చిత్తము. [అని కొంచెము సంతోషముతోను యోచనతోను వెళ్లిపోవును.]

—

శ్రీరస్తు.

# నందునిచరిత్రము.

## తృతీయాంకము - ప్రథమరంగము.

స్థలము : ఊరిబయట పొలములయొద్ద.



[నందుఁడు చింతిల్లుచుఁ బ్రవేశించును.]

నందు.— కడ కిన్నిదినంబులకు నామొఱ లానటరాజమూర్తి చెవినిఁ బడినవి. కనుక నే నాయజమానునకు నాపైఁ గరుణ కలిగినది. నేదున్ను చేలన్నియు చక్కఁగ పండి కోఁతకు సిద్ధమైనయనంతరమైనను పంపెద నని చెప్పెనుగదా. తుదకు కోఁతకువచ్చిన వెనుకనైనను బంపునుగదా! ఇఁక కోఁతకువచ్చు టెన్నఁడో? నే నా యారుద్రోత్సవముఁ జూచు టెన్నఁడో? ఇది మార్గశిరమాసముగదా? ఇప్పటిపై రిఁక కోఁతకు వచ్చుటకు రెండునెల లగును అప్పటి కుత్సవము లయిపోవుటయే గాక, అయ్యవారికి మరల నేమి బుద్ధిపుట్టునో యెఱుఁగను. దైవమా, చేతి కంది నోటి కందనీయవా? నన్నిట్లు శోధింప నగునా? ఎంతకాలము నేనీ నీచజన్మముతో నుండునది. అయ్యో! యిఁక నేయితరవర్ణజన్మము కలిగి యుండినను నిన్ను దర్శించుట కయ్యవారి నింతగా వేఁడు

కొనవలసిన యక్కఱ లేకుండును గదా? నేటిదిన మనుగ్రహించిన వాక్కును మఱువకుండునట్లయినఁ జేయవా? సర్వత్ర నిండియుండు నీవు నామనం బరసి నను దయఁజూడవా? తండ్రీ, ఇందలియొక్కొక్క యుగమును నొక మహాయుగముఁగా నున్నదే? నిన్ను నేఁ జూచు టెన్నఁడు? నీపాదసేవఁ జేయు టెన్నఁడు? ఈజన్మము వీడుటెన్నఁడు?

రాగము: సాదసామక్రియ.

పడఁగలనా పుడమిని నే - పడఁగలనా యిడుమల్
పడినవియే చాలును - నే - కడునొచ్చితిఁ గడకన్
ఎడఁదను నీయడుగుల నే - నెడఁబాయక యిడితిన్
కడువడి నీకడఁ జేరుప - తడయే వద్దముడి నన్.

కడుకొని పాపములను హరి - యించెడు దినమణివే
కడయూరన్ గాలుని తాచిన ధణిధీమణివే.

జడదారులనుడులన్ హరియించిన చిన్మణివే
నడిఁ జిత్సభలో వెలసిన - నవమణి సురమణివే॥ నటనశిఖామణివే.

(అని మూర్ఛపోవును.)

[ఒకక్షణమునకు తటాలున తెప్పరిలి లేచి] ఎవరది నన్ను లేపినది? కోఁతకు సిద్ధమైన దనియు, చిదంబరమునకు రమ్మనియు? కలవరమా? లేక నిజమా? (నలువైపులుచూచి) నిజము, నిజము. నిశ్చయముగా పైరు కోఁతకుసిద్ధమైనది. ఆయెను. కుప్పలు

వేసియున్నవి. నేఁడు నేను పావనుఁడనైతి. నాజన్మ మీఁడేరెను. భగవంతునకు నాయం దనుగ్రహము పుట్టెను. నామొఱలు వారు వినిరి. అల్లదిగో. నన్నెవరో పిలుచునట్లున్నది. [మార్పు] ఆఁ ఆఁ అదిగో! నాదేవదేవుఁడు నాపరంధాముఁడు, నా భావమూర్తి నన్ను గమ్మని పిలుచుచున్నాఁడు. తండ్రీ, ఇదే మ్రొక్కెద. వచ్చెద. [అని పరుగిడి కాలు జారిపడి లేచి చూచి] ఏమాశ్చర్యము! ఆకనకసభేశుం డగుపడి రమ్మనినది కలయా? కోఁత కుసిద్ధమైనదియు కల్లయా? మతిభ్రమయా? (కలయఁ జూచి)

గేయము : రాగము : ఆనందభైరవి.

విరిసి కెంజడలాడ - జడలఁ జందురుఁ డాడ చంద్రవదనంబు నాడఁ
గరకంఠ మెఁగియాడఁ - గెరలి భుజములు నాడఁ - గరములును గరము నాడ
అరతి కెంగౌ నాడ సరళియూరువు లాడ - నూర్ధ్వమై చరణమాడఁ
గరమున డమరు వాడఁ - గరిచర్మ మల్లాడఁ - గర్ణకుండలము లాడ
నురగకంకణ మాడ - నురము విరివిగ నాడ - నరకపాలంబు లాడఁ
గరణమున ధిమ్మి, తక ధిమ్మి, తద్ధిమియనఁ - గింకిణుల్ కిణకి ణా డఁ
బరిగణము సురగణము శరణమని-గణము కొని-వలఁచి తాండవము లాడ.
యుగంధర, దిగంబర, చిదంబర నటేశుఁడే. చిత్స్వరూపానందుఁడే.

ఆతఁడు నాకు దర్శనం బిచ్చినదియు నిజమే. నిజముగా నా నటనేశ్వరుఁడే—(యోచించి) యజ

మాంనుఁడు కుప్పలు వేయఁగనె సెలవిత్తు ననేఁ గదా. అట్టికార్యమెట్టికాలమునకు సాధ్య మని న నారోదనంబు లాయీశ్వరుండు విని యిట్టి కార్యము చేసెను. కనుక నేను సెల వడిగి యే రావలయు నని స్వామియాజ్ఞ. అట్లే చేసెద. పోయెద.

[నిష్క్రమించును.]

---

# తృతీయాంకము - ద్వితీయరంగము.

స్థలము: మిరాశిదారు నింటి ప్రాంగణము.

---

బ్రాహ్మణుఁడును, నందుఁడును ప్రవేశింతురు.

రాగము : పరాళి - తాళము, ఆది.

బ్రాహ్మ.—

నందా - నీచంద - మదియందఁ - మతిహీనమాయెరా.
డెంద మేలమందమయ్యె ముందు నీకు మందుఁడా
విందువా నామాట లింక నందుఁ బోవకుందువా॥ నందా॥
చిత్తనఁగ నకలువ్రాయుట కాదా
గుత్తవ్రాయు నప్పు డది చూడలేదా
అంబరం బాకాశఁబు గానలేదా
చూపులేదు రూపులేదు చూడరాదా.
భక్తియంచు వ్యక్తియంచు ముక్తియంచు మూర్ఖుఁడా,
రక్తిలేని మాటల నవ్యక్తిఁ బల్కుటొప్పునే
బలె, సెబాస, బేష్, మంచిది.
వహవా, బాగాయె, బాగాయె॥ నందా॥
శోత్రిభాతి నీ పీరీతి పండ్లిగిలించెద వేమిరా
జాతిని దైవం బటంచు మది నెంచు టేలరా
నీతిలేక నీ వదేల గోతినిఁ బడుదువురా,
నీచేఁతలెల్ల జాతివారు లాఁతిగాఁ దలఁపరా
భీతిలేక బూదిపూసి కూఁత వేయుచుండినన్
రోఁతగా నీమాటల్ పరంజ్యోతియు నీమూతియు॥ నందా॥

చారిష్టు.— ఇప్పటికైన దెలిసినదా చిదంబర మనగా వట్టిదని యు దైవము గైవము అంతయు మనముగా చేసిన తాయియనియు, అవన్నియుపూజించుటమంచిదిగా దనియు నే జెప్పినవంతయు—ఆఁ అదిగో నిన్నిపు డు చూస్తే, ఆచిదంబరమనే పిచ్చివదలినవాని చందముగా నున్నది. నిజమేనా? ఇక నామాటలన వుగదా?

నందు.— స్వామీ, నిజముగా నా కాపిచ్చి యింకను కుదుర లేదు. అది చిదంబరమున కేగి యాకనకసభేశుని దర్శనమాత్రముననే గాని కుదురదు. కాని, స్వా మీ నేఁబండించు చేలలోనిపైరంతయు చక్కఁగా బండికోఁతకు సిద్ధమయిననేగాని నన్ను చిదంబరము నకుఁ బంపనని యంటిరిగదా. అదేతీరున, తాము దయచేసిచేలను వచ్చి చూడఁ బ్రార్థించుచున్నాను. తమయిష్టానుసార మవి కోఁతకు సిద్ధముగా ను న్నవి.

బ్రాహ్మ.— నిజమేనా? నమ్మవచ్చునా? ఎట్లుసిద్ధ మైనది ? తెల్ల వారులోపల నింతటి విశేషమాయెనా?

నందు.— వాస్తవము; తమదాసుఁడ నబద్ధమాడను.

బ్రాహ్మ.— ఎవరురా అక్కడ ?

నౌకరు.— (ప్రవేశించి) స్వామీ, ఏమియాజ్ఞ ?

బ్రాహ్మ.— ఈనందుఁడు చేయుచేలన్నియు చక్కఁగాఁ బండి కోఁతకు సిద్ధముగానున్న వేమో చూచిరా.

నాకరు.— చిత్తము.

[అని వెళ్లును.]

బ్రాహ్మ.— మంచిది నందా. నీమాటలు కడునద్భుతంబులు. నా కేమో నమ్మతగినట్లు లేదుగాని, నిన్నటిదినము పాలుబట్టియుండిన కంకులన్నియు నీయుదయములోపల ముదిరి పండి కోఁత కెట్లుసిద్ధమైనదిరా? నన్నే మఱలించెదవా? అబద్ధమయ్యెనా నీవిక బ్రతకవు.

నందు.— స్వామీ! వాస్తవము. నాపాలిటి యాసభాపతి నన్ననుగ్రహింప నెంచి యటుచేసి, నాకు రాత్రి స్వప్నమున నివేదించి, తమ్ము ప్రార్థించి, సంగతి నెఱింగించి సెలవు గైకొని తన్ను దర్శింప రమ్మని యాజ్ఞాపించెను.

[నాకరు ప్రవేశించును.]

నాకరు.— స్వామీ! పోయి చూచితి. ఊరివారందఱు నాశ్చర్యముతో చూచుచున్నారు. ఇదేమో దయ్యమో! భూతమో! యిట్లు చేసియుండు ననియు ననుకొనుచున్నారు. కొందఱిది నందుని నిజమైన భక్తియే.

యనియు ననుచున్నారు. ఉండే ఊరు జూచిన ఈతీరుగా నున్నది. స్వామిగా! మన మేడనెక్కి చూచిన దాని నిజము తెలియగలదు.

బారిష్ట.— అటులనా సరి. వెళ్లిచూచి వచ్చెదను.

[వెళ్లును.]

---

# తృతీయాంకము - తృతీయరంగము.



స్థలము: మిరాశిదారునింటి ప్రాంగణము.

బ్రాహ్మణుఁడు ప్రవేశించును.

రాగము: నాదనామక్రియ. తాళము. మిశ్ర ఏకము.

బ్రాహ్మ.—

నందా నీశివభక్తిన్ - మందుఁడనై కాననైతి నవ్యక్తిన్
కొంటివి సిద్ధుఁడై ముక్తిన్ - దానికంటె ననుకొంటి నెల్లశాస్త్రోక్తిన్
వేదశాస్త్రంబులయుక్తిన్ - నీవు బోధించియు నరయలేనైతివ్యక్తిన్.

నందా, నీవే పరమభక్తుడవు. మహానుభావుడవు. నీవంటి యోర్వరి నేనెందును గనను. నీభక్తి నెఱుగక నిన్ను చాల బాధలబెట్టితి, మనసు నొప్పించితి. నన్ను క్షమిఁపుము. నీవంటివాఁడు నాకు దాసుఁడగుటచేత నే కృతార్థుడనైతి. నాజీవము తఱించినది. నీ కిదె యనంతకోటి నమస్కారములు.

రాగము : నాదనామక్రియతాళము.

నంద.—

స్వామీ మీరు నాయందన్ ప్రీతిచే నీరీతిఁ బల్కుతి రందున్
కొందు మీవలననిందు స్వామీ - ఎందు నెనలేని యానంద మిప్డు.

స్వామీ, మీరు నన్నేమి చేసితిరి ? నాపూర్వపు పాపము తమ్మునాకు నెలవీయకుండఁగఁజేసె. ఇప్పటి

కదితీరినది. తమకనుగ్రహము పుట్టినది. ఆనటనసభేశుఁడు నాచిత్తమును శోధింపనెంచి తమమూలముగ నట్లుచేసె. వారి కనుగ్రహము పుట్టినది: తమకును.

రాగము: యదుకులకాంభోజి. తాళము: ఆది.

బ్రాహ్మ— నీపై నేను - పాపినై చేసిన - కోపంబుల నందా.
సైపుచు నన్నొక దరిఁ జేర్చి యిఁకఁ గాపాడుము నందా॥

నందుఁడు— నాపాపంబే యీపాటిగ నను - నాపించినదయ్యా
కాపాడుటకున్ - ఏపాటిమతి - యీపంచముఁడయ్యా॥

బ్రాహ్మ— భక్తికిఁ గలదు - శక్తియుఁ గలదు - భక్తిఁ దెలుపు నందా॥
ముక్తియెట్టు - లవ్యక్తునకొదవున్ - యుక్తిఁ దెలుపు నందా॥

నందుఁడు— ఒదవును ముక్తి - చిదంబరేశుని - ముదమందుచునయ్యా
ఎదయందెపుడు - నావేంకటాఖ్యనుతుఁ గథనము చేయుమయ్యా

బ్రాహ్మ.— ఇన్ని దినములు నేను కామక్రోధాదులకులోనై నన్ను నే నెఱుఁగక మహాగర్వమున నిన్నెన్నియో బాధలఁ బెట్టితి; నన్ను క్షమింపుము. ప్రపంచసుఖంబులకు మించినసుఖము లేదని విఱ్ఱవీగుచు వేఱులోకంబులు లేవని పరమనాస్తికుఁడనై యుంటి. అట్టినాకు నీవు గురుఁడవై యుపదేష్టవై తరింపఁజేసితివి.

ఉ॥ శాస్త్రపురాణసంచయము సత్త్వవిహీన మటంచుఁ ద్రోచితిన్
గాత్రము శుద్ధమాయెఁ బొడఁగాంచితి భక్తియ యున్నఁజాలు నన్
సూత్రమె మంత్రమార్గముగఁ జూచితి నీయుపదేశ మందితిన్
క్షేత్రము లెల్ల యాత్రఁ జని చేరుదు వేగమె తిల్వకానలోన్॥

ఇక నీలోకసుఖంబులు బుద్బుదప్రాయము లనియు, శాశ్వత సుఖంబు స్వర్గలోకసుఖంబే యనియు, అందులకుమార్గము భక్తియే యనియును, ఉపదేశించితివి. మరలనీకిదెనమస్కారములు. నీకిక దాస్యము లేదు. స్వతంత్రుడవైతివి. నీయిష్టానుసారము చిదంబరమునకు బొమ్ము, ఆనటనసభేశుని దర్శింపుము, పొమ్ము.మఱియొకతడవ నిన్ను నేను వేడుకొందును. నందా! నిన్నెఱుగక, నిందించి కష్టపెట్టినందులకేమాత్రమును కినియక క్షమింపవేడెదను.

నందు.— స్వామీ, బాల్యముమొదలు నన్నుపోషించి వృద్ధికిం దెచ్చుటయేకాక మీయండనుండం బట్టియేగదా నాకీసద్గతి యలవడనాయెను. ఇంతియేకాక తాము నునట్లునన్నంత కష్టపెట్టంబట్టియేగదా నాకుమఱింత భక్తియలవడుటాయె. స్వామి, తామునన్నుక్షమించి యాశీర్వదించి పంపుడు. స్వామీ, తాము నన్ను వెంబడింతునంటిరి, చక్కని యోచనయే. అయినను మీవలన, మీయండనెందఱో బీదసాదలును, ఎన్నియోజీవములును బ్రదుకుచున్నవి. వెంటనే వెంబడింతురేని వారును, అవియు నాదరణం బాసియల్లాడవలసియుండు. నే నట్లుకాక యొంటరిని, తాము సంసారమం దుండియే భక్తిం జేసి ముక్తి చెందవచ్చును. లేదా, కొంతకాలమునకుం బిదప సన్న్యసింపవచ్చును.

బ్రాహ్మ.— నందా, పోయెదవా? పొమ్ము. నన్నొక్కసారినిన్ను కౌగిలించికొననిమ్ము. నీవెందున్నను నన్నుమఱువకు ము,పొమ్ము. చిదంబరమున స్వామిదర్శనము చేయు నపుడు నన్నొకమారు తలచుకొనుము.

[నందుని కౌఁగిలించుకొనును.]

నందు.— (నమస్కరించి వెళ్లును.)

బ్రాహ్మ.— [నిష్క్రమించును.]

---

# శ్రీ ర స్తు.

# నందుని చరిత్రము.

## చతుర్థాంకము - ప్రథమరంగము.



స్థలము: చిదంబరమున నొక వీథి.

[నందుఁడు పాడుచుఁ బ్రవేశించును.]

రాగము : నారోజ్. తాళము : ఆది.

నందు.—

సుందర మగునందనములును - ఇఁదలి పద్మసరంబులును
చందిరశాలామందిరములును - చంద్రసభేశునిధ్వజ మహాహా॥
నలుదెసలను గోపురములును - పలువిధమణిమండపములును.
చాలగువృక్షపథంబులును - పాలుఁ బోద్విజులగృహంబులును
కంటినిసచ్చిదానందమును - ఉంటిని యోగానందమునఁ
గొంటిని పరమానందమును - వెంటనె బ్రహ్మానందమును॥

కనకసభేశుఁడునన్నుఁగరుణించెను; నాయొడయఁడు నాకు సెలవిచ్చి పంపెను. ఇఁక ధన్యుఁడ నైతిని. ఆ పైని యెట్లు నేనీయగ్రహారమును దాటి యాలయమును పిమ్మట సన్నిధిని చేరఁగలనో? ఆపరమేశ్వరు నెట్లు చూడఁగలనో, తరింపఁగలనో యను చింత మాత్రము బాధించుచున్నది. [ఘంటారవము] ఏమి చేయుటకును, ఎటుపోవుటకును దోపదు. మాలవా

నీకిచట నేమి పనియని చేరనీయక తఱిమివేసిన, నింత గడిచి వచ్చిన నా కింక గతి? ఈశ్వరా! జగదీశ్వరా!

రాగము : మాంజి . తాళము : చాపు.

అరుగనౌనా - అయ్యా - మీకర్
ఓరనుండి కొనియాడను పాడను ||అరుగ||
కరుణాలవాలుండ వౌదువే - స్వామి
పరమచండాలుండ నైతినే - నీదు
పరమానందతాండవవేడుకం జూడ||
పంచముండై జనియించితి స్వామీ,
కొంచెమైనను చేయనైతినే - పుణ్యము
మించివచ్చితి భవసాగరము
ఎంచి సన్నిధికివచ్చితి నే
కరుణా భరణా శరణందితి నిను ||అరుగ||

నీసన్నిధినుండువా రెంత మమ్ముచేరనీయక గాని, నీ దర్శనము చేయనీయక గాని యుండినను, మాయంత రంగమున నుండు నీరూపును మాపంగలరా? నిన్ను స్మరించుట నాపం గలరా? అదేలనో వా రెఱుంగ కు న్నారు?——ఏల వారి కీవెత్తి? వారికిం గాదు——నాకు ——కష్టపడిననే ఫలము. సమస్తము కర్మానుసారము. నన్నిటరమ్మనికలలో నాకగపడి,రప్పించుకొనిన వర దాయకుండు, కరుణాలవాలుండు, కడకు చేవిడుచు నా? ఊంహుం-విడువండు.నమ్మిచెడినవారు లేరు. లీలా మానుష విగ్రహుండు ఏలీలం గావించునో? ఇంక ను వేచెద. ఆతనినే భజించుచుండెద. [పాడును]

రాగము : ధన్యాసి. తాళము: ఆది.

కనకసభాపతి దర్శన మొకపరి - కనిన పాపము లీగుణ ||
సనకసనందన - మునులు నుతించెడి
దినకరకోటితేజోమయుఁడౌ నా|| కనక||

కీర్తనలను వినఁగల్గు సామీప్యము
పఠనముఁ జేసినఁ గల్గు సాలోక్యము.
మననముఁ జేసినఁ గల్గు సారూప్యము
అన్నిట దేహికిఁ గల్గు సాయుజ్యము|| కనక||

పెరపెరయోచన జేయుట యెల్ల
పరగతిఁజెందుచుపాయము కల్ల
నర వేంకటాఖ్యుని మన ముల్లసిల్లఁ
గిరణాకరుఁ డనుచును మీ రెల్ల|| కనక||

(యవనికపడును.)

## చతుర్థాంకము - ద్వితీయరంగము.



స్థలము : చిదంబరను ఊరిబయట.

త్రైలమ్మ, కామాక్షమ్మ ప్రవేశింతురు.

త్రైలమ్మ.— ఎవరాపోయ్యేది, కామాక్షమ్మగారా?

కామా.— త్రైలమ్మగారా ఆ అడిగేది?

త్రైల.— ఔను. [నారు.

కామా.— ఎక్కడికి యీవేళ యింత పొద్దున్నే బయలుదేరి

త్రైల.— స్నానానికి.

కామా.— ఏమి విశేషము?

త్రైల. మాంవారేమో పనున్నాది. ఎక్కడికో వెళ్లవలెనం టేను.

కామా. చలి వేళ్లే, మీ రప్పుడే లేవడం, స్నానానికివెళ్లడం ఆశ్చర్యంగా ఉంది.

త్రైల.— సరేగాని, మీకావేరి కొ ల్లెట్లున్నది?

కామా.— ఉండడ మేమి? (నిట్టూర్పు) నాల్గురోజులుగా వేశిన చేయి తీయుట లేదు. మనలోకమే లేదు.

త్రైల.— అయితే అదేం రోగమమ్మా, అనాకొనా లేనిరోగం. పాపం పిల్లదాని కెక్కణ్ణుం చొచ్చిందో?

కామ.— ఎక్కణ్ణుంచోనా, దానిప్రాణాల కుస్సురు మని మేన

మామగాడు చిక్కినాడు. నాల్గుడబ్బులు వస్తుందిగదా యని 80 యేండ్లముశిలివానికిచ్చాడు. మేమంతా వొద్దొద్దోనని మొత్తుకొన్నావినలేదు. ఊం—దానిరాత యెవరు తప్పింపగలరు ?

[అని యేడ్చును.

తైల.— ఏడవకండి. ఏడవకండి. పాపం. గ్రహచారాలన్నీ మనకు మనుష్యులకుగాక రాళ్ల కొస్తాయా. పెద్దవాళ్లు మీకు తెలియనిది లేదు.

కామ.— మరేంలేదు. అది యేసౌఖ్యం యెరగదు. పాపం యెట్లయినా ప్రాణాలతో బ్రదికి బట్టకడితేచాలును.

[శేషమ్మ మీనాక్షమ్మ ప్రవేశింతురు.

శేష.— అదేమే. మీనాక్షీ. రాత్రి కనకవల్లిని మొగుడట్లా చావతెన్నినాడు. వాడిపొంగుకుంగా !

మీనా.— వాణ్ణి నువ్వేమెరుగుదువు. నిరుడుశ్రావణ మంగళ్వారంనాడు ఎందుకో కోపమొచ్చి ప్రక్కనున్నదుడ్డుకఱ్ఱదీసి చావమొత్తేటప్పటికి చేతిగాజులన్నీ విఱిగి పూజచేస్తుణ్ణ అమ్మవారిమీాద పడిపోయిందే.

[గౌరమ్మ ప్రవేశించును.

గౌర.— మరితన్నరూ దానిచేతలకు.

శేష.— దానిచేత లేమిటే ?

గౌర.— చేతలా? వాడు ఇల్లువాకిలొల్లక అట్టేదేబరిస్తుంటే అన్నిటికి ఓరుస్తుండేదే చేతలు.

(సక్కుబాయి ప్రవేశించును)

పుల్ల.— సరిసరి. దానిగుణాలు మీకు తెలియవు గాని, అది మాత్రం సామాన్యురాలా? మొన్న అస్తమానమప్పుడు చిత్రకూటం వెళ్లిండి ఆచార్లవాళ్లరంగడితో మాట్లాడుతుంటే మొగుడెక్కణ్ణుండో వస్తూ అది చూచాడట. దానిపని బాగున్నదా? మగవాడెట్లున్నా ఆక్షేపణలేదు. ఆడవాళ్లుమాత్రం తిన్నగా నుండవల్సిందే.

కార — అదిగాదే, పాపం సుందరిని అత్తగారెంత కోడం ట్రికం పెట్టి వేపుకొని తింటున్నదే. రోజూ దాని మొగుడు దేవాలయంనుండి యింటికి వచ్చేటప్పటికి లేనిపోనివి నాల్గు చెప్పి తన్నిస్తున్నది. దీనికేమి చేటుకాలమో. అద ట్లుండ నియ్యండి. నేను అత్తగారు లేకున్నా ఆడబిడ్డవల్ల పడ్డబాధవుందే. అబ్బబ్బ యమబాధ యిక అక్కర్లేదు. నాకు మంచి కాల ముండి నిరుడు అమ్మవారుపోశి దైవం కడుపు చల్లగా ఇప్పటి కాచెంగాళమ్మకు ఆదివారమాదివారం అంబలిపోయిస్తున్నా. ఇక యెవరైనా ఆడబిడ్డ నని వస్తారేమో నని, ఆ ఆవిడ వెళ్లింది మొదలు, కొంచెము మనుష్యులలో కలిశి పట్టెడు మెతుకులు తింటున్నాను.

శేష.— పిండిబొమ్మనుచేసి పీటమీదపొడితే ఆడబిడ్డతనానికి అదిరదిరి పడ్డదట.

గౌర.— ఇదుగో నమ్మో, నే నన్న మాట లెక్కడా వాడవద్దు. ఆమె చెవ్వలో పడితేనా ఇక చంపివేస్తుంది.

శేష.— సరేలే, ఇదాపని. ఇంటింటా మట్టిపోయ్యే. గౌరీ, ఏమిటిదే మెడలోను? నానులుకొన్నావా యేమిటి?

ఒకరిద్దఱు — ఎక్కడ్నో, ఎక్కడ్నో?

[అని చూతురు.

సక్క.— దానికేమి లెండి. ఇప్పటికి యింటికి పెద్దదైంది. మగడికి అభిమానం. అత్తగారూ ఆడబిడ్డపోగానే మగడు ఏటా ఒక సొమ్ము చేయిస్తుంటాడు.

గౌర.— మీ కేంచెప్పక. కాపురానికి వచ్చిపదేండ్లైనవి. ఒక సొమ్ముగాని మంచిచీరగాని తుదకు రవికగాని యెరగను. ఇప్పటికేదో వెక్కిరించినట్లు ఒకటూ నే మీరు పరిహాసంచేస్తారు. కనకవల్లిని చూడండి. తల మొదలు కాళ్లవఱకును ఎన్నిజతలున్నవో. దాని మగనికి దానిమీద అమితానురాగం. ఇచ్చిపెట్టుకొన్నది.

మీనా.— అదిగాదే. నీకూతురిని జ్ఞానమ్మకొడుకిస్తారన్నే చెప్పావుకావు.

సక్క.— ఏమి. జ్ఞానమ్మకొడుక్కా? సొమ్ము లేంపెడతారు?

మీనా.— సొమ్ములేమిటి. సొమ్ములును గిమ్ములును వారికేముంచీ గృహ్యాశి?

శేష.— ఏమీ. పెండ్లంటే తుదకు నూరువరహాలుసొమ్ములన్నా లేకుండానా?

మీనా.— వరహాలుకావు. నూరుదమ్మిడీలు చెప్పు.

వెంక.— ఏమే, నిజమేనా?

మీనా.— ఇదిగో నే నొకటంటా విను. సొమ్ములెందుకు, గిమ్ములెందుకు? ఆలుమొగుడు కన్నగా ఉంటే అదే చాలు. బుద్ధివస్తే సంపాదించి వాడే పెడతాడు. ఇప్పుడది కావలె. ఇది కావలెనంటే. వాళ్లు వియ్యంకులకు సమానంగా జరుపుకోవలెనని, ఉండేదికాస్తా అమ్ముకోవడం, వెనకటికి భోజనానికిగాని కొడుకు చదువుకుగాని లేక అల్లాడి ఆకులు మేయడం. పిల్లపెద్దదై యింటికి వచ్చేటప్పటికి యేమీలేక, అదివచ్చిన వేళ– ఇదివచ్చిన వేళ, అని దాని ఉసురుపోసుకోవడం ఏం బాగుంట్లే. నాకేగనక కూతురుంటే ఊరికే ఒక బ్రహ్మచారిని పిలుచుకొని వచ్చి కట్టివేతును.

వెంక.— నీమాటలు నిజమేనమ్మా. తిరుపతిగారింట్లో అప్పయ్యశాస్త్రులఅల్లుడిగతి యేమైంది. ఇప్పటికి కాపుకి లేదు. 10, 20 వెలిస్తేనే గాని ప్రయోజనం చేసికొనననని అంటున్నాడు. గొప్పవారింటి పిల్లగదాఅని, మగపిల్లవాడులేడు గదా అని ఆస్తంతామనకొస్తుందని, ఉండేదికాస్తాపుస్తానాపుట్రాఅంతా అమ్ముకొని యిప్పటికి జోలె కట్టుకొనేగతిపట్టినది మూర్ఖంచేత పిల్లనింట్లోనే పెట్టుకోవలెననే బుద్ధివారికిని అయిందే.

గౌర.— ఇదిగో, చాలాపొద్దయింది మాటలలోనే. సూర్యోదయానికంతా చేరవలెనన్నారు మాయింటాయన.

తైల.— మరిమాయింటాయనా ఆమాటే అన్నారు.

శేష.— మాయింటాయనా ఆమాటే అన్నారు.

సుబ్బ.— ఏమిటి విశేషం ?

మీనా.— ఎవడోనందుడట. మాలవాడట. వాడు మహాభక్తుడట. వానిని బ్రాహ్మణులు గుడికిగాని తుదకు అగ్రహారముత్రోవగాని రానీరు గదా. అందుచేత వాడేడుస్తుంటే, దేవుడు కలలో మాయింటాయనతో పొద్దున్నే పూర్ణకుంభాలతో మేళతాళాలతో వేదపారాయణాలతో వానిని ఎదురేగి పిలుచుకొని రావలసింది అని అన్నాడట, అందుగ్గాను.

శేష.— మాయింటాయనా ఆమాటే అన్నారు.

గౌర.— మావారుగూడ ఆలాగే చెప్పిరి.

కామా.— ఏంకాలమే. మాలవాడు ఊళ్లోకిరావడం. అందులో అగ్రహారం. మరి దేవాలయానికి వెళ్లడం, బ్రాహ్మలెదురువెళ్లడం. అంతాకలిముదురుతున్నది. పీడ. మనంవాళ్లను చూస్తేనేపాపం. పేరుచెపితేనే ప్రాయశ్చిత్తం చేసుకోవలె.

మీనా.— అమ్మా. పెద్దవాళ్లట్లా అనబోకండి. మనకంతా తెలివివచ్చేందుకేగదా, దేవుడురాత్రి కలలో యిట్లా చెప్పడం? మాలమంగలి అంతామనంగా తెచ్చిపెట్టుకొన్నదేగదా ! మాలవాడేనని దేవుడు వాణ్ణి పుట్టించకగాని, ఇప్పుడు గుడిలోకి పిలుచుకోరావద్దని

గాని అన్నాడా? అట్లనకండి. వాడు మహాగొప్ప వాడట.

కామా.— సరినరి. మీకేం చెడిపొయ్యేకాలమే? ఇట్లా సంకర మాతారు. మీకంతా కొంచెం చదువు రాబట్టి యిట్టి విపరీతపుబుద్ధులు పుడుతున్నాయి, చాలు మీసహవాసం.

శేష.— అమ్మా. మనమే గొప్ప, మనకే దేవుడు, మన కాయిష్యం, మన కారోగ్యం. అన్నీ మనకే నంటే ఇకవారి గతి? తెలివిగలమనము తక్కువగా ఉండేవాళ్లను వృద్ధిలోకితెస్తే అదిమహా పుణ్యమను కోండి. ఇంతకన్నా విశేషంలేదు.

కామా.— పుణ్యమో గిణ్యమో. చాలు నిలువండి, మీసహవాసం. అంతా మాలమయం చేస్తున్నారు. నేవెళ్లి పోతా.

[నిష్క్రమించును.

తక్కినవారు. సరేగాని, గట్టుకొచ్చినాము. ఇక వేగరం వెళదాం రండి.

[అందఱు నిష్క్రమింతురు.

శ్రీ

# నందనిచరిత్రము.

## పంచమాంకము.



స్థలము: చిదంబరదేవాలయము.

[బ్రాహ్మణులు మంత్రపుష్పము పఠింతురు. వాద్యములు, కర్పూరహారతిమున్నగునవి జరుగును. కడపట జ్యోతి యగపడును. నందుఁడందు ప్రవేశించును, మరల క్షణమునకు నందుఁడు విభూతి రుద్రాక్షమాలాధరుఁడై ప్రవేశించును. బ్రాహ్మణులకందఱకును నమస్కరించును]

నంద.— అయ్యలారా, అందఱకు నమస్కారములు. మీకొక్కవిషయము చెలుపఁగోరితిని. అది మీకందఱకును తెలియనివిషయము కాదు, గాని విపరీతముగాఁ నెంచవలదు. జగన్నాథుఁడగు పరమేశ్వరుని పరమాణు స్వరూపులమగు మనలో నొకరెక్కువయు నొకరు తక్కువయు లేదు. అతనికి జాతిమతభేదములులేవు. అతనికి క్రోధమాత్సర్యంబులు లేవు. కర్మననుసరించిపుట్టుకలో నెచ్చుతక్కువ లుండినను, కాలదేశవర్తమానంబులననుసరించి కొన్ని వ్యవస్థలు

కొంతవఱకుండవలసిన యావశ్యకమైనను, సోదరభావమున నూతఁబడినవాని కూతనిచ్చి కాపాడవలయును, విడువరాదు. విరాట్స్వరూపునకు, పరమాణుస్వరూపుల మగు మన కట్టి విపరీతభేదము ఉండనగునా? ఉండిన నతనికపచారము గలిగించినట్లుగాదా? సర్వభూతములను తమవలెనే పాటించి, యహింసామనస్కులై యుంటయే సకలధర్మములలోను మేలైనది. ఎవ రెన్నిపదముల నుండినను, ఎన్నిదారులఁబోయినను, తుదకు చేరవలసినదాతనినేగదా? అదియే పరమానందము, యోగానందము, విద్యానందము, సచ్చిదానందము, బ్రహ్మానందము. ఆయానందమే యీశ్వర స్వరూపము. ఇదియే మనమందఱము మనసునందు దృఢముగానుంచుకొనవలసిన శ్రుతి. ఇంక నేజెప్పవలసిన దేదియు లేదు. నన్ను పరమేశ్వరుఁ డనుగ్రహించెను. కొన్ని దినములు తాపసవృత్తినుండి తుదకతని కలిసికొనవలసిన ట్లాజ్ఞయాయెను. ఇక నేను తపమునకు వెళ్లెదను. మీకందఱకును నమస్కారములు.

ఉ. ఒక్కఁడె లోకరక్షకుఁడు నొక్కఁడె దైవము నెందుఁజూచినన్
మిక్కుటమైన రూపముల మింటికి మంటికి సూత్రధారియై
తక్కి సమస్తలోకములఁ దాండవమాడుచు నున్నవాఁడు తా
నొక్కఁడెగాక యీశ్వరుఁ డిఁకొక్కఁడు కావఁగ లేఁడు లోకులన్.

చ. వెలయఁగఁ జావుఁ బుట్టుఁ గల వేల్పులఁ గొల్చిన సౌఖ్యలేశముఁ
గలుగదు నిప్పు డిందులకుఁగా ననుమానము లేదు పుట్టుచా
వులు మఱి లేని సాంబుని శివుఁ భజియించినవారు ధన్యులై
సలలితమైన యాపరమసౌఖ్యము నొందుచునుందు రిప్పుడే.

(నమస్కరించి వెళ్లును.)

మంగళమ్ - మంగళమ్ - మంగళమ్.



చెన్నపురి, 'శ్రీరామ' ప్రెస్సున ముద్రితము:— 1928.

## సీతారామాంజనేయసంవాదము, సటీక.

అనేక నూతనవిషయములఁ జేర్చి చిన్నసైజున చక్కఁగ ముద్రించినారము. టీక మిక్కిలివిపులము. పీఠికలో కవిచరిత్ర కూడ విపులముగ వ్రాయఁబడియున్నది.

సాధారణప్రతి రూ. 2-0-0. మేలుప్రతి కాలికో రు. 3-8-0.

## విషవైద్యచింతామణి, సాంధ్రతాత్పర్యము.

ఇందు తేళ్లు, పాములు, పిచ్చికుక్కలు మున్నగు సమస్త జంతువుల కాటులకును చికిత్సలుగలవు. విషవైద్యగ్రంథముల లో నిట్టి దింతవరకు ప్రకటింపఁబడలేదు.

ప్రతి 1-కి రూ 2-0-0.

## చక్రదత్త (వైద్యము.)

ఇది చక్రపాణి విరచితమగు ఉత్తమమైన వైద్యగ్రంథము. ప్రతి ఆయుర్వేదవైద్యులును, తద్విద్యార్థులును ముఖ్యముగా పఠింపవలసిన ఉత్తమోత్తమ గ్రంథము. రూ. 3-12-0.

## భర్తృహరి సుభాషితము.

సవ్యాఖ్యానాంధ్ర పద్య టీకా తాత్పర్యసహితము.

ఇందు ఏనుగు లక్ష్మణకవి, ఎలకూచి బాలసరస్వతి, పుష్ప గిరి తిమ్మన— ఈముగ్గురి ఆంధ్రపద్యముల చేర్చి చక్కఁగ ముద్రించినారము.

గిల్టు పేరు, కాలికో బైండు ప్రతి 1-కి రూ. 2-0-0.